శ్లో. విక్రేతుకామా కిలగోపకన్యా
మురారిపాదార్పిత చిత్తవృత్తిః
దధ్యాధికం మోహావశాదవోచ
ద్గోవిన్ద దామోదర మాధవేతి.

శ్రీ కృష్ణకర్ణామృతము




# అగ్రవర్ణములందలి అస్పృశ్యత

ఇటీవల జరిగిన ఆరవజార్జి సార్వభౌముల పట్టాభిషేక మహోత్సవ సందర్భమున లాహోరునగరమున నొక బాలికాపాఠశాలయందు మిఠాయిపంచిపెట్టబడెను. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయిని క్రైస్తవ స్త్రీ. ఆమెయే పిల్లలకు మిఠాయి పంచుచుండెను. ఆ పాఠశాలయందే పనిచేయు నొక హిందూస్త్రీ, క్రైస్తవులు తాకిన తినుబండారములు హిందువులు తినగూడదు కాన ప్రధానోపాధ్యాయిని మిఠాయిని పంచుట మానవలయునని వచించెను. దానిపై ప్రధానోపాధ్యాయిని కోపముచెంది కఠినముగా మాట్లాడెను. అంత యిరువురు ఉపాధ్యాయినులు వాచావాచి విజృంభించి దానితో తృప్తిజెందక బాహాబాహి తమ శక్తిసామర్థ్యముల నొకరొకరిపై ప్రదర్శించుకొనిరి. తరువాత వారిరువురు పైయధికారులకు ఫిర్యాదుగావించిరి. వారు విచారించి యేమిచేయుదురో పర్యవసానమేమగునో మనకనవసరము. కాని యిట్టి సంఘటనలు సాధారణముగా దైనిక జీవితములం దష్టు తగులుచుండును. ఇవి సాధారణమయ్యు వీనియందొక గొప్పసమస్య అంతర్భూతమైయున్నది.

హిందూమత మతిపవిత్రమైనది. అన్యమతస్థులగు వారికిందు స్థానములేదు సరిగదా వారి సంబంధము స్పర్శ మనదైనిక జీవితమం దెంతమాత్రమును కూడదు. మన

తినుబండములనుగాని, వానిని సిద్ధపరచు పదార్థములను, పాత్రలను తుదకు నీటిని కూడ వారు స్పృశింపకూడదు. అట్లుగావించినచో హిందూమతము అపవిత్రమగును; మనజాతికి కళంకము గలుగును.

ఈవిషయము మన్యమతములకే వర్తించునుగాని మనమతమునందలి యేవర్ణమునకుగాని వర్తింపదని మన మెఱిగియున్నచో అన్యమతస్తుల దూరముగానుంచుట కీ విధముగ గావించియుందురని దలంపవచ్చును. కాని హిందూమతమునందు అస్పృశ్యులను వారే యున్నారుగదా! దీనికేమి సమాధానము జెప్పవలయును?

నాగరికు లనాగరికజాతులతో వసింపవలసివచ్చినపుడు అనాగరికజాతులు హింసాదికార్యముల జేయుచు, నాగరికులకసహ్యము బుట్టించుచు అపరిశుభ్ర జీవితముల గడపుచునుండ వారలతో గలసి మెలసి వర్తించుట ఆరోగ్యసూత్రముల నతిక్రమించి జాతీయోన్నతి కాటంకము గలిగించుటగునని వా రస్పృశ్యులని యొక తెగ నేర్పరచి వారిని దూరముగా నుంచియుండవచ్చునని సమాధానమును జెప్పెదు రేమో? అదియే నిజమని యంగీకరించినను అగ్రవర్ణముల వారలయందే తమలోతమకు అస్పృశ్యతావాసన గొంతవఱకు కనబడుచున్నది. దీనికేమి సమాధానము చెప్పవలయునో దెలియకయున్నది. అగ్రవర్ణులవారి యాధిక్యతను తదితరవర్ణముల వారు సర్వదాగుర్తించియే నడచుకొనుచుండవలయును. వారు తమకంటె తక్కువవర్ణము లనదగు వారియెడ కొంచము అస్పృశ్యతను బాటింతురు. వారుమాంసాశనులైనందునను, ఆరోగ్యసూత్రముల పాటింపనందునను ఈరీతినున్నదని సమాధానపరచుకొనుటకుసాధ్యమగుట లేదు. ఎందుకన తప్పనిసరిగా నందరికిని గావలసియుండి తక్కువవర్ణములచే అగ్రవర్ణులకు సప్లైచేయబడు పదార్థముల కెట్టి అస్పృశ్యతయు పాటింపబడుట లేదు. అదియునుగాక అగ్రవర్ణులితరుల విషయములో నిది పాటింపరు. ఒకబ్రాహ్మణుడు తక్కిన వర్ణముల వారి ఆహారపదార్థములను గాని పాత్రలనుగాని నీటినిగాని తాకవచ్చును. అపుడవి అపవిత్రముగావు, ఆరోగ్యసూత్రముల కడ్డుతగులవు.

ఏ వర్ణములవారైనను ఏ మతస్థులైనను ఆహారపదార్థములయెడ నారోగ్యసూత్రములనుసరింపవలసినదే. దీనినెవరును కాదనజాలరు. కాని మూలసూత్రముల నేమూలకో త్రోసివైచి, యాసూత్రములపై నాధారపడి యాచరణలోనికి దీసికొనిరాబడిన యాచారములను మాత్రము అనుష్ఠింపవలయుననుట సరికాదు.

నేటి సాంఘికజీవితము చాలవఱకు మారిపోయినది. ఇంతవఱకు ఆహారపదార్థములకు సాధ్యమైనంతవఱకు ఇతరులపైన యాధారపడవలసిన యావశ్యకత లేకుండెను.

నే డట్లుగాదు. పూర్తిగా పక్వముచేయబడిన పదార్థముల కితరులపై నాధారపడుచున్నాము. భోజనము, ఫలహారములు, రొట్టెలు మొదలగు వానినెన్నింటినో యారోగ్యసూత్రములను-యాచారములను-లెక్కింపక గుటకాయస్వాహా చేయుచున్నాము. వాని నెవరుచేయుదురో, చేయుటయందెట్టి పరిశుభ్రతను పాటింతురో గమనింపము. కాని అది మనచేతులలోనికి వచ్చిన తరువాత తక్కువవర్ణములవారో అన్యమతస్థులో తాకినంతమాత్రమున-అది అపరిశుభ్రమైనదప్ప-దానికి గలిగిన న్యూనతయేమి? అపవిత్రతయేమి? అట్లగునని తలంచుటకు హేతువెయ్యది?

బజారులోని దుమ్ముధూళి పైపొరగా గప్పియున్న మిఠాయివంటి వస్తువులను దిన్న వర్ణమత వ్యవస్థలను బాటింపక అనారోగ్యమును గలిగించును కాని, దాని నంగడి నుండి తెచ్చిన తరువాత తక్కువవర్ణముల వారో అన్యమతస్థులో తాకిన పిదప దిన్నంతమాత్రమున మతమున కపవిత్రతగాని కులమునకు కళంకముగాని కలుగబోదు. ఇదియొక యుదాహరణము మాత్రమే. ఇటువంటి విషయములే దైనికజీవితమునం దపుడపుడు సంభవించుచుండగలవు. దానిలో యారోగ్యసూత్రములను మరువక, వర్ణమత న్యూనతాధిక్యతలను నిష్పక్షపాత దృష్టిని జూడవలయును. ఇతర వర్ణములవారితో ఇతర మతస్థులతో నెట్టి సంబంధముగాని లేక సాంఘికజీవితము గడపు టసాధ్యమైన నీదినములలో, అస్పృశ్యతనే అడుగంట చేయవలయునని మహాత్ములందరు పాటుబడుచుండు నీరోజులలో నీవిధమగు అస్పృశ్యత అగ్రవర్ణముల వారియందుండుట శ్లాఘనీయముగాదు. అదియునుగాక క్రైస్తవ మహమ్మదీయ మతస్థులందరును మనదేశమునందలి మాలమాదిగలే యనుకొనుటుచితము గాదు. అట్టివారు కొంతమంది ఆమతములందు చేరియున్నను వారు నేడు హిందూమతమునందలి అగ్రజాతులతో సరిసమానముగనే యున్నారు.

# రైతు ఉద్యమము - స్త్రీలహక్కులు

గుమ్మిడిదల వెంకటసుబ్బారావుగారు

ఇటీవల మనదేశములో ఒకనూతనరైతు ఉద్యమసూచనలు బయలుదేరుచున్నవి. 1908 సంవత్సరపు గవర్నమెంటువారి ఎస్టేట్ల ల్యాండ్ ఆక్టు, ఇటీవల జస్టిస్ పార్టీవారి యీనాములచట్టము, ప్రస్తుతము ముఖ్యముగా కాంగ్రెస్ వారికి సంబంధించినరైతు ఉద్యమము అన్నిటిలోను మూలసూత్రము ఒకటే. ఎమ్.ఎన్. రాయిగారు చెప్పినట్లు "భూమిదున్నుకొనేరైతుకున్ను రాజుకున్ను మధ్య దళారీలుండకూడదు." దీనియొక్క అంతరార్థము క్రమముగా జమీందారులు, ఇనాందార్లు, అగ్రహారీకులు, భూఖామందులు ఉండకూడదని యిటీవల ముఖ్యముగ మన కాంగ్రెస్ నాయకులు స్పష్టపరుస్తూనే యున్నారు.

మనము నిష్పాక్షికముగా యోచిస్తే, యిప్పటి ఇండియారైతు స్థితియేమిన్నీ బాగు లేదని ఒప్పుకోకతప్పదు. అందుచేత యీ రైతు బాగుపడడానికి జరిగే అన్నియత్నములతోను మనము సానుభూతి కలిగియుండాలి. రైతే దేశానికి వెన్నెముకని మొన్న డాక్టర్ పట్టాభిగారు చెప్పినారు. రైతు బాగుంటేనే, దేశములో ప్రజలకు అన్నము లభిస్తుంది. రైతు బక్కచిక్కితే ప్రజలు, పశువులూ రెండుకూడా శుష్కించిపోతాయి. నిశ్చయముగా ఆలోచిస్తే, శృతిప్రకారము వైశ్యధర్మములైనకృషి, గోరక్షణ, వాణిజ్యములలో మొదటి రెండున్ను మనస్మృతికర్తలు అలక్ష్యపరచి, ఒక్కవణిక్జనులకే జ్ఞానజ్యోతిని లభింపజేయుటవల్లనే మన ప్రస్తుతదేశ దారిద్ర్యము అరిష్టము సంభవించినదని అనిపిస్తూంది. తిరిగి దేశము ఔన్నత్యస్థితికి రావలెనంటే మన కర్షకులకును, గోపాలకులనుకూడి స్మృతిపథములోకి తీసుకొని రావాలి. ఇప్పటిరైతు ఉద్యమము క్రమముగా ఆత్రోవకు నడిపించునుగాకయని ఆశించుచున్నాము.

అయితే యిప్పటి రైతు ఉద్యమములో స్త్రీలకు సంబంధించిన భాగము మాత్రము ఒక్కటి ఉన్నది. దానినిగూర్చి 'గృహలక్ష్మి'యు, గృహిణులును జాగ్రత్తగా యోచించాలి. సకాలములో యీవిషయమై ఆలోచించకపోతే ముఖ్యముగా మన వనితాలోకమునకు చాలా యిక్కట్టులు సంభవిస్తాయి.

ఆ విషయమేమంటే, ముందు మన భారతరాజ్యములో స్త్రీకి భూమి సంబంధమైన హక్కులు యెట్టివై యుండవలెను?

ఇది చాల ముఖ్యప్రశ్న. ఎందుచేతననగా యిప్పటి భారతదేశములో ముఖ్య

ముగ మన హైందవస్త్రీలకు ఆ స్తిహక్కులు చాల స్వల్పముగనున్నవని అందఱు నెఱుగుదురు. ఉన్న స్వల్పమును ఆభరణాది చరా స్తిగనుండును. కొద్దిభాగముమాత్రము యిండ్లు భూములు రూపమునగనుండును. ఇటీవల కాంగ్రెస్ సభలలో నిరూపింపబడే "భూమి దున్నుకొనే రైతుకు, రాజుకు మధ్య దలారీలుండరా" దనే సూత్రము స్త్రీల కుండకున్న యీ కొద్దిపాటి హక్కులకును మెట్టి భంగము కలిగించును? స్త్రీలు స్వయముగ భూమి దున్నుకొనజాలరు గదా! అట్టి సందర్భమున స్త్రీలకు యిప్పుడుగల భూమి హక్కుల గతి యేమి కావలెను? ముందు ముందు స్త్రీలు తమ స్త్రీధనమును భూమిరూపముగ సంపాదించుకొనవలెనా? అక్కరలేదా? అనే ప్రశ్నలు సహజముగ నుదయించును.

ఈ ప్రశ్నలకు ముఖ్యకారకులయిన మన కాంగ్రెసుమిత్రు లీవిషయమై తగుసమాధానమిచ్చి నారీలోకమును తృప్తిపరచుట వారి విధి. సర్వసాధారణముగను, అందు ముఖ్యముగ తమ కరాచీ ప్రాథమికహక్కుసూత్రమందును స్త్రీల క్షేమమునకు మన కాంగ్రెస్ మిత్రులు సుముఖులగుటచే యీ విషయము సకాలమున, సక్రమముగ యోచించి, స్త్రీలలో అనవసరముగు ఆందోళనకును, అలజడికిని తావీయకుందురు గాక యని కోరుచున్నాము.

---

# గృహలక్ష్మి దసరాసంచిక

అక్టోబరు మాసారంభమున గృహలక్ష్మి దసరా సంచిక వెలువడును. దానిలో స్త్రీలచే రచియింపబడు వివిధవిషయములకు సంబంధించిన చక్కని పద్యగద్య వ్యాసములు ప్రకటింపబడును. దీని కాంధ్ర విద్వత్సోదరీమణుల సాహాయ్య మత్యంతావశ్యకము. కావున సోదరీమణులెల్ల తమ పద్యగద్య వ్యాసములను త్వరగా బంపి దసరా గృహలక్ష్మి సర్వాంగ సుందరిగా వెలువడునట్లు తోడ్పడుదురని మనవి.

సంపాదకుడు.

# చిత్ర ప్రశ్న

గత మాసమునందలి చిత్రప్రశ్నకు సమాధానము:-

(1) మంగళూరు. (2) రంగపూరు. (3) ధార్వారు. (4) సాంచి. (5) బీజపూరు. (6) వినుకొండ. (7) జయపూరు.

సరియైన సమాధాన మొక్కటియును రాలేదు.

ఒక తప్పుగల సమాధానము వ్రాసిన ఈక్రిందివారికి జూలైనుండి ఒక సంవత్సరము గృహలక్ష్మి సంచికను ఉచితముగా పంపబడును.

శ్రీమతి స. వివేకానందగారు,
c/o ఎస్. వెంకటరత్నంగారు,
దానవాయిపేట, రాజమండ్రి.

క్రింద ప్రచురింపబడిన పజిలును పూర్తిచేసి సరియగు జవాబును మా కార్యాలయమునకు జూలై 15-వ తేదిలోపున మావద్ద సీలుచేయబడిన జవాబుతో సరిపోవునట్లు పంపినవారికి ఒక సంవత్సరము గృహలక్ష్మి సంచిక ఉచితముగా పంపబడును. స్త్రీలు మాత్ర మిందు పాల్గొనవగును. జవాబులన్నియు గృహలక్ష్మి కూపనులందే యుండవలయును. ఒకరొక రొక్కన్నైన జవాబులను పంపవచ్చును. ప్రవేశ రుసుము లేదు. సంపాదకుల తీర్మానమే అంత్యముగా గణింపబడును.

ఫలితములు ఆగస్టుమాస పత్రికయందు ప్రకటింపబడును.

అడ్డము

1. ధ్వని.
3. దిట్టము. (వెనుకకు)
4. పండితుడు.
7. పెక్కు ఔషధము లీ రూపముననుండును.
10. క్రెరత.
11. శౌర్యము.
12. ఆధునికము.

నిలువు

1. వరుస.
2. గోపికలను మోహింపజేసినది.
3. అశక్తుడు.
5. స్త్రీలకు సౌందర్యము నిచ్చునది.
6. ఒక పార్శ్వము. (పైకి)
8. సుప్రసిద్ధాంధ్రకవి.
9. యుగళము.
13. తంత్రీ వాద్యవిశేషము. (పైకి)
14. వలయకారపురేఖ (పైకి)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | డి | 3 |
| | ■ | 4 | 5 | 6 | |
| ■ | 7 | | | ■ | |
| 8 | ■ | ■ | ■ | 9 | ■ |
| 10 | ణ | | ■ | 11 | |
| 12 | 13 | | ము | ■ | 14 |

పేరు.................................

చిరునామా...........................

.......................................

గృ. ల. 4.

# "విద్యోదయ" బాలికా పాఠశాల

(ఒక విద్యాధికుఁడు)

ఇది మద్రాసులో పాల్ అప్పస్వామి సతిగారి సత్సంకల్పమువలన 1924 వ సంవత్సరమున ప్రారంభింపఁబడినది. నేఁడు నుంగంబాకము రటలాండుగేటున నడచుచున్నది. ప్రతిపచ్చంద్రమసుని వలె నానాటికి వర్ధిలుచు తన యశోచంద్రికల దశదిక్కుల వెల్లివిరియఁ జేయుచుండెను. అప్పస్వామి సతీమణిగారేగాక వారి కుటుంబమునందందఱు పాశ్చాత్యప్రపంచముతో నమితపరిచయముగలవారగుటచే నీ విద్యాలయముద్వారా వారు ప్రాక్పశ్చిమములకు సమరసతఁ గల్పించి "East is East and West is West, never the twain shall meet" యనిన యాంగ్లకవి సత్తముని వేదవాక్యమునుఁ బొల్లుగావించిరి. ఈసంస్థకు జాతిమతవివక్షతలులేక ప్రతివారును యథాశక్తిఁ దోడ్పడుచుండిరి. "వైరివర్గంబులయు సహవాసమొంది" యను నాదిపర్వములోని పద్దెము ప్రేక్షకులాంధ్రులైన న్స్ఫురించుచుండును.

స్త్రీవిద్య యిట్లుండవలె నట్లుండవలెనని శ్రీరంగనీతులు చెప్పువారేగాని కార్యరంగమునకుఁదిగి భారతస్త్రీలోకమునకు సద్విద్యాదానముచేసి తత్ప్రపంచమునుఁబట్టి పీడించు దాస్యశృంఖలముల వీడ్చుటకు ప్రయత్నించువా రొక్కరేనియు గానరారు. అట్టితరి పైవా రర్థప్రాణముల దీనికై వెచ్చించుటకుగాను బద్ధకంకణులగుటయేగాక తమ బంధుగులను హితులను పలుమారు దర్శించి ప్రయాసకోర్చి చందాలు వోఁగుఁ జేసి యీ యమృతవల్లిని దినదినము పోషించుచుండిరి.

ఇందలి బాలికలందఱు నున్నతవంశజులే. జనన మున్నతవంశమందైనను, భారత భాగ్యోదయమునకుగాను తా మెట్టుల విని యోగపడుదురో యట్టి విద్య నుదార హృదయయగు సంస్థాపకురాలు ప్రసాదించుటచేతను బోధకురాండ్ర నిరంతరకృషి వలనను దేశక్షేమకకృత్యములందు బాలికల కభిరుచి జనించినదనుట యత్యుక్తి కానేరదు. ఇందు పాఠములేకాక యాటపాటలు, లలితకళలు దక్షురాండ్రచే నేర్పఁబడును. ఏతద్విద్యాలయమందు నూటనలుబది మంది బాలికలున్నారు. అందు నలుబది ముగ్గురు వసతిగృహమునందు నివసించుచుందురు; పాఠశాలాధికారిణులు వీరికొసఁగు స్వాతంత్ర్యమును దుర్వినియుక్తముగావింపక తమ భవిష్యజ్జీవనమున కెంతయో తోడ్పడు కర్మకాండలు సదా నిర్వర్తించుచు వారిమన్నన కెంతయోపాత్రులగుచుందురు. ఈపాఠశాలను తిలకించు నాంధ్రహృదయము. "గృహ నీతివిద్యకు గృహము విమల చారిత్రికాచార్యకంబను" సీసమున పలుమారు తలంతుకనుట సత్యదూరము కాదు. ఈ బాలికలొనర్పు నృత్తగానముల పాఠకలోకమున కెఱుగపరచుటకుగా నిట కొన్ని ఛాయాపటములు ముద్రాపితములాయెను—(ఇచ్చటి విద్యావిధానమును గూర్చి వీలయినచో మఱియొకతూరి నివేదించుకొందును.

# ఈశ్వరేచ్ఛ!

గీ. జాతికవులు నవలెక్షన్ల సమయకవులు,
పెక్స్టుబుక్కుకవులు, కమిటీలచుట్టు
దిరుగుపరమావధులు, సర్వ తెలివిన్రాత
లెగయువిఁక నేమిసేయనో నీశ్వరేచ్ఛ.

గీ. సంపదధికారముల సర్వసదనములకు
విత్తము విమర్శనము దుర్నిమిత్తములకు
సరసకవనము లరసికసంఘములకు
తార్చకీశ్వర రక్షించు ధరణిప్రజల.

ఆ.వె. స్వార్థతంత్ర దృష్టి సంస్కర్త లెగయక
కపటనాటకములు గడనసీక—

కృత్తివెంటి వెంకటసుబ్బారావుగారు

ఆటవెలఁది పోకలలర, యోగ్యతాప
హేతువుగనె చేయకెనఁగుజనము.

గీ. చీడపుర్వు జాత్యభిమాన పీడలేమి?
భావకవి సుప్రణయగాథ పదములేమి?
భారతావనికీ దాస్యభార మేమి?
ఏమి గావింపనున్నదో ఈశ్వరేచ్ఛ!

గీ. అభినవేత్యాది బిరుదమ్ములవలఁదొలఁగు
భావకవిగోల తెలియంగ వలనుగలుగు
లక్షణముగ సిరుల గృహలక్ష్మి మెలఁగు
ఏమిసేయంగఁ జాలదీ ఈశ్వరేచ్ఛ!

# తల్లికిని సాటిదైవంబు తలపఁగలదె?

సీ. కలదైవములఁ గొల్చి—పలుబాధలకు నోర్చి
క్రమమారఁ పిల్లలఁ—గనెడుతల్లి
ఎగ్గులన్నియుఁ సైచి—ఉగ్గుపాలనుబోసి
తమిమీరఁ పిల్లలఁ—దనుపుతల్లి
పరుకంట బడకుండఁ—పదిలంబుగానుంచి
మందుమాకులఁ నిచ్చి—మనుచుతల్లి
పోర్వెట్టి ఏడ్చెడు—ముద్దుబిడ్డలఁ నెత్తి
విసుగక లాలించి—పెనుచుతల్లి

గీ. ఎన్నగాఁరాని బాముల నెన్నొగనుచు
అన్నపానాదులఁ సయితె—మరయమాని
కన్నబిడ్డల సౌఖ్యంబుఁ—కరముగోరు
తల్లికిని సాటిదైవంబు—దలపఁగలదె?

అ. గఫూర్



విద్యోదయపాఠశాల బాలికలచే ప్రదర్శింపబడిన పుష్పనాట్యమునందొకదృశ్యము.



విద్యోదయపాఠశాల సంగీత తరగతి

భారతభూమి అనాదినుండియు మతములకు బుట్టినిల్లై ప్రపంచవాసుల మన్ననలకు బాత్రమైనచో, నందులకు రామకృష్ణాద్యవతారమూర్తులయు, బుద్ధుడు, శంకరుడు, రామానుజుడు, గౌరాంగుడు, రామకృష్ణపరమహంస, వివేకానందుల వంటి ప్రవక్తల యాజ్ఞల నైతిక జీవితములును, బోధలును కారణములు. ఇంకీదేశపు రమణులు సైతము వెనుకాడలేదు.

# రాణీ గోప

స్త్రీలు గృహనిర్వహణమును వీడినయెడల సమాజము తారుమారగునని బుద్ధుడు బహుశ తలచియుండవోపును. అంతియేగాని స్త్రీలు ప్రచారకులగుటకుగాని, మోక్షప్రాప్తికి గాని యనర్హులని యాయన యుద్దేశ్యముగాదు. ఇందునుగూర్చి యాయన ప్రియశిష్యుడగు నానందుడు ప్రతితడవయు నాయన స్త్రీ ప్రచార

క్రీ. పూ. సుమారు 550 సంవత్సరములక్రిందట, కపిలవస్తు నగరమునకు సమీపమున, కోలియను చిన్న రాజ్యమును, శుద్ధోదనమహారాజునకు దగ్గరబంధువును, సూర్యవంశీకుడును నగు దండపాణియను క్షత్రియ వీరుడు పాలించుచుండెను. గోపయను నామాంతరము గల యశోధర యీయనకు గారాబుపట్టి. తండ్రి యీమెయెడ శ్రద్ధవహించి క్షత్రియకన్యల కుచితమగు విద్యాబుద్ధులు చెప్పించెను. యుక్తవయస్సురాగానే రూప, విద్యా, శీలములం దసామాన్యయగు నాకన్యకు అనురూపుడగు వరునికొరకాయన వెదకుచుండెను.

ఈసమయమున, తండ్రియనుమతమున యౌవనుడగు సిద్ధార్థరాకుమారుడు, "అశోకవంద" ఉత్సవమునకు రాకుమారికలందరకు నాహ్వానములంపెను. (ఇది స్వయంవరమునకు బదులుగా నా కాలమున వాడుకలో నున్న యాచారము. ఈయుత్సవమునకు వీరుడగు క్షత్రియకుమారుడు, తనచుట్టుప్రక్కల రాజకుమారికలందరకు నాహ్వానములంపును. వచ్చినవారందరిని గౌరవించి, వారికి విలువగల కానుకలనొసగి, యనిపి, వారిలో తనకు నచ్చినకన్యను వరించును.) దూరమునుండియు, సమీపమునుండియు పెక్కురు క్షత్రవంశజాత లాయుత్సవమునకు విచ్చేసి, యువరాజుచే కానుకలను గైకొనిరి. కానుకలన్నియు ముగిసెను. బాలికలు సెలవుదీసికొని వెడలుచుండిరి.

ఈసమయమున, మిగుల నాత్రముతో కోలి రాకుమారి యచటికివచ్చెను. తోడనే పరిచారకు లామెను యువరాజున కెరుకపరచిరి. ఆమె యతనితో "రాజకుమారా! ఆలస్యముగావచ్చుటచే, నాకేమియు లేదుగాబోలు" ననెను.

నియమితములైన యమూల్య వస్తువులన్నియు నయిపోవుటచే, సిద్ధార్థుని కేమిచేయుటకును పాలుపోలేదు. అయినను, సమావేశమైన కన్యలందరిలో నుత్తమురాలును, తనకు సమీపబంధురాలును, సత్కారమునకు పూర్ణయోగ్యురాలు నగు నామె నెట్లూరక పంపగలడు? విశేషించి, లజ్జావినమ్రములగు నామెచూడ్కు లాయన హృదయమును కరగించెను. ఒకనిముస మాలోచించి యతడు తనవ్రేలి యమూల్యరత్నాంగుళీయకమునుదీసి, యామెకడకువచ్చి "రాకుమారీ, నీవు చివరకువచ్చినను నాదృష్టిలో ప్రథమురాలవే! కావున నీ ప్రేమ బహుమానము నంగీకరింపు" మని పలికి యా యుంగరము నామె వ్రేలికి తొడిగెను. గోప మిగులసంతుష్టయై, సెలవుగైకొని వెడలిపోయెను. ముద్దుటుంగరముతో బాటు, తనహృదయ రాజ్యమును సైతము, కపిలవస్తు భవిష్య సార్వభౌముడు తనకు సమర్పించెనని యామె యూహించెను.

శుద్ధోదనమహారాజు, ఉత్సవవృత్తాంతములను, అందు యశోధరను తనకుమారుడు వరించుటయు దెలిసి

# యశోధర

కుల కేల యనుమతినిచ్చుటలేదనియు, ఆయన సందేశము పురుషులకు మాత్రమేనాయనియు, దీక్షాధారిణులగు స్త్రీలు సిద్ధాదియవస్థలనుదాటి, కైవల్యమునుగాంచ సశక్తలాయనియు ప్రశ్నించ బుద్ధభగవానుడు "మోక్షసామ్రాజ్యమును సంపాదింప స్త్రీపురుషులిరువురును సమానశక్తియుతు లేనని" జవాబిచ్చుటనుబట్టి తెలియగలదు.

> అవతారమూర్తియగు బుద్ధభగవానునకు భౌతికజీవితమున సహధర్మచారిణియై, తరువాత నాతని స్త్రీశిష్యులలో నగ్రగణ్యయై యాతనియాశీర్వాదముతో భిక్షుకునీగణమును స్థాపించి, మానవకళ్యాణము కొరకు తనజీవితమును నిస్వార్థతతో, వినమ్రతతో, పవిత్రసేవాభావముతో బౌద్ధధర్మ వ్యాపనమునకు వినియోగించి, ధన్యయైనది యశోధరదేవి.

కొని, వెంటనే యావార్తను కోలిసంస్థానాధీశ్వరునకు తెలియజేసెను. కాని శూరుడగు దండపాణిరాజు, తన యనుగుతనయను పీఠాధిపీఠుడగు క్షత్రియవతంసమున కొసగదలచి యువ్విళ్లూరుచున్న వాడగుటచే, బాల్యమునుండియు క్షత్రవిరుద్ధములగు సాధులక్షణముల కలవాటుపడిన సిద్ధార్థునకొసగ నీయకొనలేదు. బొత్తుగా కాదనలేక, కపిలవస్తుయువరాజు సాము గరిడీలయందును, విలువిద్యయందును సాటిలేనివాడని పేరుపడసిననేగాని యాతనికి తన తనూజాత నీయజాలనని కబురంపెను.

పరమసుశీలుడగు సిద్ధార్థుడు, దండపాణిసవాలును సుహృద్భావమున గైకొని, అంతవరకు తాను క్షత్రవిద్యల నలక్ష్యమొనర్చుట వాస్తవమేనని యంగీకరించి నాటినుండి వానియం దత్యధికశ్రద్ధతో కృషిచేయ జొచ్చెను. జన్మసిద్ధుడగు నామహాత్ముడు, తీవ్ర పరిశ్రమవలన రెండుసంవత్సరములలోనే, సమస్తశారీరక విద్యలలోను నిపుణుడై, మేటివిలుకాడని ఖ్యాతి గాంచెను. దండపాణిరాజు తన యదృష్టరేఖను కొనియాడి, శాక్యరత్నమునకు తన పుత్రికారత్నమునిచ్చి, మహావైభవముతో బరిణయమొనర్చెను.

భాగ్యశాలియగు యశోధర, యత్తవారిల్లుచేరి, లోకోత్తరచరిత్రుడగు భర్త నిర్మలప్రణయమును కన్నబిడ్డవలె గారవించు నత్తమామల ప్రేమను అసంఖ్యాకులగు బంధుమిత్ర పౌరుల మన్ననలను పరిచారికల విశ్వాసమును చూరగొని మహాభోగభాగ్యములనడుమ కాపురము చేయుచుండెను. అది యామెజీవితమున సువర్ణయుగము కాని క్షణికమగు నాభాగ్యమామెకు చిరకాల మబ్బిరాలేదు.

సిద్ధార్థకుమారుడు, నిర్బంధ సంసారిగానున్నను, ఆయన మానసముచుట్టునుగల సమృద్ధభోగములవంక గాక యున్నతములగు భావధ్యానములతో తలమున్కలు వేయుచుండెను. ఆత్మస్వాతంత్ర్యమును, లోకస్వాతంత్ర్యమును వాంఛించు నమ్మహాభాగునకు, భోగములు కంటకములుగాను, రాజ్యమును, అంతిపురమును తన్ను బంధించు చెరసాలలుగాను గనపడెను.

ఇట్టి మానసికస్థితి యందుండగా నాయన కొక కుమారు డుదయించెనని వార్తవచ్చెను. వెంటనే యులికిపడి, యింకను ఆలసించినచో తన గైహిక బంధములు దృఢపడగలవని ఎంచి రాకుమారుడు నాటి యర్ధరాత్రమున దనకు బరమప్రియులైన పత్నీపుత్రులను, తల్లిదండ్రులను, సమస్తపరిజనమును, రాజ్యభోగములను విడనాడి, సన్న్యాసియై దేశాటన మొనరించి బైలుదేరెను.

గోప కలవంటి తన వైవాహికసుఖ స్వప్నములనుండి యులికిపడి మేల్కాంచెను.

సిద్ధార్థుడు సత్యాన్వేషియై తపసియై దేశాటన మొనర్చుచుండ నిట నాధీరపత్ని యేమియొనర్చెనో చూతము. ఆమెయు భర్తవలెనే యసాధారణవ్యక్తి. భర్తమార్గమును త్రికరణముల ననుసరించిన సాధ్వి. భర్తవెడలిపోయినతోడనే, యామెకర్తవ్య నిశ్చయ మొనర్చుకొని యప్పటినుండియు నాయనకు ప్రతిబంధకముగా గాక, సహకారిణిగానుండ దీర్మానించుకొనెను.

వృద్ధుడగు తండ్రినుండి మహారాజ్యాధిపత్యమును గైకొని, ప్రకాశించవలసిన రాకుమారుడు, ప్రవాసి యయ్యెనని కపిలవస్తునగరము దుఃఖపూర్ణమయ్యెను. రాజభవనమంతయు పరిచారకుల రాకపోకలుడిగి, కళ కాంతులుదక్కి పాడువడినట్లుండెను. మహారాజును, ఆయనపత్ని గౌతమియు, దుఃఖభరాక్రాంతులై, నిద్రాహారములుమాని ఖిన్నులైయుండిరి. యశోధర వారివలె నిరాశకు తావీయక, దుఃఖవివశురాలు గాక, అమూల్యములగు తన యాభరణములను, చీనిచీనాంబరములగు వర్జించి, యోగివలె కాషాయాంబరములను ధరించెను.

ఆమె యీ నిష్ఠురసంకల్పమునుమార్ప వృద్ధరాజ దంపతు లెంతయో యత్నించిరి. అందులకామె యిట్లు జవాబుచెప్పెను. "పూజ్యులారా ? నాపదవడియందు వింత యేమున్నది ? నాభర్త యువరాజుగానుండ నేను రాణిగానుండు టెంత యర్హమో, నేడాయన సన్యాసియైయుండ, నేను సన్యాసిని నగు టంతే యవసరముకాదా ? ఆయనవలెనే, నేనును దేశాటన మొనర్చుటకూడ ధర్మమైనను, నాధుడు నాకు ఒప్పగించిన శిశుభారమును వహించవలసియుండుటచే, సాధ్యము గాకున్నది. కావున యింటనేయుండి ఆయన యనుష్ఠించు ధర్మముల నవలంబించ నిశ్చయించితిని. ప్రాణముల నైన విడుతును. కావించినదీక్షను విడువజాలను. కావున నాకు తాము అభ్యంతరములు కలిగించవలదని వేడుచున్నాను."

క్రమముగా వారు ప్రతిఘటనమునుమానిరి. ఆమె భోగములన్నిటిని పూర్తిగావర్జించి రాజభవనములోనే సన్యాసినియై తిరుగజొచ్చెను.

దినములు వారములై, వారములు నెలలై, నెలలు సంవత్సరములై గడచిపోవుచుండెను. గాని యాదేవీ చర్యయం దనుమాత్రమును మార్పులేకుండెను. ఆమెయిప్పుడు తననాధునిరాకను ప్రణయినివలెగాక, యాయన తపముఫలించి లోకకళ్యాణ సంధాయకుడగు జగజ్జ్యోతియై తిరిగిరావలెనని వేయివిధముల కోరుచుండెను.

ఆమె ప్రార్థనము సఫలమయ్యెను. గౌతముడు దేశదేశములుతిరిగి, యనేకమంది గురువులనాశ్రయించి, చాలకాలము తపమొనర్చి, యనేకవిఘ్నములుగడచి, చివరకు ఆశ్రమముగనే, లోకశోకమునకు మందును కనుగొని మారవిజయుడై లోకసంపూజ్యుడైనబుద్ధుడై, తన శాంతిసందేశమును దశదిశల వ్యాపింపజేయ నారంభించెను. స్వానుభవయుతమును, దుఃఖరహితమును వర్ణవిభేదరహితమునునగు నమ్మహాత్ముని యుపదేశామృతమును తనివిదీర గ్రోలి భారతీయులు నానాట వందలు వేలుగా నాయనమత మవలంబించుచుండిరి.

అధిభౌతికముగా తన కుమారుడొనర్చుచున్న దిగ్విజయయాత్రలనాలించి వృద్ధుడగు శుద్ధోదనమహారాజు, ఆయనను అవసాన కాలమునకు ముందొకసారి చూడ గోరి, కపిలవస్తునగరమునకు విచ్చేయవలయునని, పెక్కురచే నాయన కాహ్వానములంపెను. మహారాజుచే పంపబడిన రాయబారులు బుద్ధభగవానునిచేరి ఆయన దివ్యమూర్తిని సందర్శించి బోధామృతమునకు బరవశులై తమ సందేశముసేమరచి, యాయనకు దానులై యచటనే నిలిచిపోవుచుండిరి. ఇట్లు పెక్కుసారులు జరిగెను. వారిరాకకొర కెదురుచూచి, విసిగి, వేసారి, కడకు వృద్ధరాజు తన కత్యంతవిశ్వాసపాత్రు

డును, గౌతమునకు బాల్యసఖుడునగు కాలుని బంపెను. ఆతడు సైతము, తనకు ముందువచ్చినవారి వలెనే, భగవానునికి శిష్యుడయ్యెను. కాని తన సందేశమునుమాత్రము మరువక, వసంత కాలము రాగానే, దుఃఖసంతప్తులైన రాజదంపతులను యశోధర దేవిని, ప్రజలను సంతృప్తులను చేయుటకు రాజధానిని దర్శించవలెనని తథాగతుని ప్రార్థించెను.

న్యాయమైన యా కోర్కెకు భగవాను డంగీకరించి కొన్ని వేలమంది శిష్యులతో కపిలవస్తు నగరమును ప్రవేశించెను.

వయసున వృద్ధుడై రాజ్యభారానతుడైన శుద్ధోదనమహారాజు సామంతులు, మంత్రులు, రాజబంధువులు పరివేష్టింప నాయనకు సుస్వాగతమొసంగి సత్కరించెను. తేజోసంపన్నుడైన యా కుమారునందలి మోహమును త్రెంచుకొనజాలక మహారాజు గౌతము నుద్దేశించి క్షత్రియజాతుడగు నాతనికి భిక్షుకవృత్తి యనుచితమనియు రాజ్యపాలనము పరమధర్మమనియు, తనకై దిక్కులు చూచుచున్న రాజ్యలక్ష్మిని వరించి, తన్నును ప్రజలను నుద్ధరించవలెననియు నంత్యప్రార్థనము గావించెను.

సిద్ధార్థుడు చిరునగవు దొలుకాడ. "తా నవలంబించినది బుద్ధుల మార్గమనియు, లోకకళ్యాణమునకు తోడ్పడుట యుభయలోకతారకమనియు" తెలిపి, తన మతసూత్రములను బోధించి తండ్రికి మతదీక్ష యొసంగెను.

మధ్యాహ్న భోజనముల యనంతరము దేవిగౌతమి మున్నగు నంతఃపుర కాంతలెల్లరును తథాగతుని దర్శించిరి. ఒక్క దేవి యశోధర మాత్రమే రాలేదు. సంవత్సరములుగా నాయన మూర్తిని హృదయమున దాల్చి యాయన శుభాగమనమునకు నిత్యము నెదురు చూచుచుండు నామె కౌత్సుక్యములేక కాదు. తన రాక యా శుభమూర్తికి సంకటము కలిగించవచ్చునని పొంగి పొరలుచున్న యౌత్సుక్యము నడంచుకొని స్త్రీత్వమును జంపుకొని తెరమరుగునుండియే యా లోకపావనమూర్తిని దర్శించి యంతరంగముననే ధన్యవాదముల నర్పించెను.

అర్హతుని దర్శించుటకు రావచ్చునని మహారాజామెకు కబురంపెను. కాని యర్ధరాత్రమున నామె యనుమతి గైకొనకుండనే వెడలిన దోషము తనయందుండుటచే తానే యామెను చూడబోవుదునని తథాగతుడు శారిపుత్రుడు, మొంగలానులను యిరువురు ప్రియశిష్యులతో గూడి యామె యంతఃపురమునకు బయలుదేరెను. దారిలో వారినిగాంచి, భగవానుడు "నాకొరకై యశోధర సంవత్సరములనుండి కృశించి తపించుచున్నది. కాన నన్ను చూడగానే హృదయతాపనివారణమునకై నా పాదములమీద వ్రాలగలదు. ఆమెను వారించినచో హృదయముపగిలి మరణించగలదు. కావున, చివర కామెయు, నామె పరిజనమును దీక్ష గైకొనగలరు గావునను, యాసమయమున నామె కడ్డురాకు" డని బోధించెను. వారును వల్లెయనిరి (బుద్ధుని శరీరమును ముట్టుకొనుట కెవరికిని నధికారములేదు.)

తన నోములు ఫలించి తథాగతుడు వచ్చుచున్నాడని విని దేవి శిరోజములు కత్తిరించుకొని మిగుల వినీతములైన వస్త్రములను ధరించి, తన యయిదు వందల పరిచారికాజనముతో నా మహాభాగున కెదురేగుదెంచెను. ప్రేమపూర్ణయగు సాధ్వి, భగవానుని విక్రతవేషమును చూడగానే దుఃఖభారమున నిలువజాలక వివశయై రోదించుచు నాయన పాదములకడ బడిపోయెను. కాని క్షణములో స్మృతి దెచ్చుకొని పూజ్యుడగు మహారాజచ్చటనుండెనని గ్రహించి లేచి ఎడముగా నిలుచుండి యా మహాభాగునకు అతిథి సత్కారముల నొనర్చెను.

శుద్ధోదనమహారాజామె పవిత్రశీలమును పొగడి, "పూజ్యుడా! ఇచ్చట యీయామె చర్య యాకస్మిక పరివర్తనమని తలంపకుందువుగాక! ఏనాడు నీవు

శిరోముండన మొనర్చుకొంటివనియు, నియమితకాలములందు మాత్రమే మంటిభిక్షాపాత్రమును దాల్చి, భిక్షాశనమును భుజించుచుంటివనియు వార్త వచ్చెనో నాటినుండియు నీమె యాపద్ధతులనే యవలంబించెను. ఎందరెన్ని విధముల నొత్తిచెప్పినను భాగములను కన్నెత్తి చూడలేదు. కాన తా మీమె యుపచారమును మన్నించదగు"నని విన్నవించెను.

యశోధర ప్రియపుత్రుడగు రాహులుని తండ్రి యాశీర్వాదమును, పితృభాగమును పొందమని పంపెను. భగవాను డాతనిని మనసారదీవించి రాజ్యముకంటె నెన్నిరెట్లో మడుగు లధికమగు భాగ్యము నొసగదలచితినని చెప్పి, యాతనికి తోడిమానవుల యభ్యుదయమునకై కృషిసలుపుమని దీక్షనొసగి వెడలిపోయెను.

కొన్నివత్సరముల యనంతరము శుద్ధోదనమహారాజు మరణించెను. సృష్టిలో సగభాగమగు స్త్రీలకు భగవానుని సందేశ మందచేయుటకు తనకును, తన తోడివారికిని దీక్ష నొసగవలసినదిగా ప్రార్థించుచు యశోధర, భగవానునకు మూడుసారులు విన్నపములంపెను. కాని యాయన మూడుసారులును త్రోసిపుచ్చెను.

బుద్ధుని కఠినత్వమునుజూచి యిక సందేశముల నంపి ప్రయోజనము లేదని యసూర్యంపశ్యలును, పరమసుకుమారులునునగు శుద్ధోదనమహారాజు ధర్మపత్ని యగు దేవి ప్రజావతియు, యశోధరయు అయిదువందలమంది సామంతరాజ్ఞీగణమును వెంటచేసి, తల వెంట్రుకలను కత్తిరించుకొని, కాషాయాంబరములను, జోలెలను ధరించి, కపిలవస్తు నగరమును విడచి, కంటకయుతములగు దుర్గమారణ్యములను కాలినడకను గడచి మిగుల గాసినొంది ధూళిధూసరితగాత్రలై వైశాలియందున్న ప్రభువును దర్శించి తమకు దీక్ష యిప్పించవలెనని దీనముగా వేడుకొనిరి. వారి దృఢసంకల్పమునకు విస్మితుడై తథాగతు డీసారి వారి ప్రార్థనమును త్రోసివేయజాలక వారందరికిని దీక్ష యిప్పించి భిక్షుకినీ గణమేర్పరచెను. అదళమునకు యశోధర యధిపతిగా నియమించబడెను.

విశుద్ధచరితయగు యశోధర తన చిరసంకల్పమీడేరి భిక్షుకియై పతి యనువ్రతయై ప్రశాంతధ్యానయై యార్తులయెడ దీనానుకంపకలిగి తోడ్పడుచు బౌద్ధసందేశవాహులగు స్త్రీరత్నములకు శిరోమాణిక్యమై చెన్నారెను. సిద్ధార్థుని లోకశాంతికర సందేశమును ప్రపంచమున వెదజల్లుటకై దీక్షవహించిన యా నిస్వార్థ పవిత్ర వరనారీసమూహముల కామె వినమ్రత, సహిష్ణుత, విరామ మెరుగని కార్యనిర్వహణదీక్ష, పతితసోదరసోదరీగణము నెడచూపు నాదరణము బరపుబంతులై యుండెను. కాలగర్భమునబడి నేడా మతము పెక్కు యితర మతములవలెనే హిందూమతమున జీర్ణమై భారతదేశమున వెలికి గానరాకున్నను బర్మా, సింహళము, చైనా, జపానువంటి దేశము లందు సజీవమై కోట్లకొలది యనుచరులను గలిగియుండుటకును నాడు అశేషభారతదేశమునేగాక ప్రపంచమున పెక్కుదేశముల నాక్రమించుటకును యిట్టి స్వార్థరహితులైన భిక్షుక భిక్షుకినీగణముల కృషియే మూలమని చరిత్ర వాక్రుచ్చుచున్నది.

అందును మహనీయమూర్తియైన యశోధరదేవి చరిత్రము ఎల్లకాలమును ప్రాపంచబౌద్ధచరిత్రకారుల మన్ననలకు పాత్రము కాకతప్పదు. లోకోద్ధరణార్థ మవతరించిన బుద్ధుడు జన్మించిన పుణ్యదినముననే జన్మించి ఆయనకు ఐహికజీవితముననేగాక యాధ్యాత్మికజీవితముననైతము సహచారిణియై ధన్యజీవితయైన యీ మహోత్తమురాలు బుద్ధభగవానునికంటె రెండు వత్సరములు ముందుగా నిర్యాణమందెను.

ఆచంట లక్ష్మీనరసింహం

# పశ్చిమదేశ గ్రంథాలయోద్యమము

యార్లగడ్డ శ్రీకృష్ణ దొరగారు

[ఈవ్యాసము ప్రియసోదరీమణుల పఠనార్థము వ్రాసి ప్రత్యేకముగ "గృహలక్ష్మి" పంచికను ప్రచురణార్థ మంపుటలోని పరమార్థము సోదరీమతల్లుల గమనికయందు ఫలించినచో భావి భారతసామ్రాజ్యలక్ష్మిని స్వాతంత్ర్యపీఠమునవిల్పి జేజే లొసంగు సుపుత్ర రత్నములను తయారుజేయగల మహోద్యమమిదియని గ్రహింపకపోరని నావిశ్వాసము.]

జారు ప్రభుత్వము నంతరింపజేసి ప్రజాప్రభుత్వమును స్థాపింపగలిగినది రష్యా. అన్ని దేశములకంటె కొలది కాలములో విజ్ఞానవాహినిని ప్రవహింపజేసి, మాతృదేశమును ముందుకు తీసుకొను రాగలిగినది రష్యా. ప్రపంచములోకెల్ల మహోన్నత దేశము రష్యా. ఈ దేశముయొక్క విస్తీర్ణము 82,41,673 చ. మైళ్లు. జనసంఖ్య 16,21,43,000. చెల్లించు రివిన్యూ 400 కోట్ల రూపాయలు. ఈ దేశముయొక్క చరిత్ర తిలకించినచో 1917 సంవత్సరము వరకు 100కి 30 మంది మాత్రమే చదువగలిగినవారుండిరి. 1933 సంవత్సరాంతముయొక్క లెక్కలనుబట్టి చూడగా 100కి 90 మంది చదువగలిగినవారున్నారనగా 17 సం॥లలో ఇంత గొప్పపరివర్తనము కలుగుటకు నచటి గ్రంథాలయోద్యమమే కొంతవరకు కారణమని తలంపవలెను. సామ్యవాదసిద్ధాంత తత్వమును ప్రజలకు రుచిచూపగలిగిన దీ దేశము; వైజ్ఞానిక, రాజకీయ విద్యలయందు ముందంజవేసిన దీదేశము. లెక్కకు పెద్దవిమానములు నేడు రష్యాలోనే యున్నవి. ఈ దేశముయొక్క స్వాతంత్ర్య పురుషుని నామము "లెనిన్". రష్యా దేశముయొక్క స్త్రీ, యువ వృద్ధ, బాల బాలికాహృదయ పేటికలయందు సువర్ణాక్షరములతో అంకితమై పోయినది. ఈ మహనీయుని చరిత్రను తిలకించినచో, రష్యా దేశము, మహోన్నతస్థితి కెట్లు రాగలిగినదో తెలియగలదు. ప్రపంచమంతటిలో గొప్ప గ్రంథాలయము లీదేశముననేగలవు. ఈ దేశమునకు ముఖ్యపట్టణమగు "మాస్కో" నగరమున "లెనిన్" మహాశయుని పేరుతో "లెనిన్ స్టేటులైబ్రరీ" అనునొక గొప్ప గ్రంథాలయముగలదు. అందు 60 లక్షల అచ్చుపొత్తములు విరాజిల్లుచున్నవి. ఈ దేశములో వెలువడు వార్తాపత్రికలన్నియు ఒక్కొక్కప్రతి యీ గ్రంథాలయమునకు వచ్చుచుండును. ఈ గ్రంథనిలయము అనేక విభాగములుగా విభజింపబడియున్నది. స్త్రీలు, యువకులు, వృద్ధులు, బాలబాలికలు చదువుకొనుటకు శాఖాభాగములు గ్రంథాలయాంతర్భాగముననే విభజింపబడినవి. ప్రతి

దినము వందలకొలది ప్రజలు యీ గ్రంథాలయమున చదువుకొనుటకువచ్చి పోవుచుందురు. ఇట్టి పెద్ద గ్రంథాలయము మరియొకటి యీ దేశములోనే "లెనిన్‌గ్రాడు" పట్టణమున "పబ్లిక్ లైబ్రరీ"యను పేరుతో విలసిల్లుచున్నది. అందు 50 లక్షల అచ్చుపుస్తకములు గలవు. 33 వేలు మిక్కిలి యుపయోగకరములైన కరపత్రములుగలవు. "లెనిన్ స్టేటు లైబ్రరీ"వలె అన్ని శాఖలు గలవు. ఈ దేశములోనున్న గ్రంథాలయములు చాలవరకు మానవమేధః క్షేత్రముల నుండి వీరవిజ్ఞానవాహినుల బ్రవహింప జేయుచున్నవి. 1930-31 సం॥ల యీదేశపు కేంద్రగ్రంథాలయ నివేదికలనుబట్టి చూచిన యెడల యీ దేశములోనున్న గ్రంథాలయముల సంఖ్య 27, 312. గ్రంథములు వెరసి 9 కోట్ల 40 లక్షలు. చదువరుల సంఖ్య 1 కోటి, 16 లక్షలు. సంచార గ్రంథాలయములు 11, 100.

ఈ సంచార గ్రంథాలయము లెంతయో యీ దేశమునకు మిక్కిలి నుపయోగకరమగు సేవజేయుచున్నవి. దీనినిబట్టి రష్యాదేశము, వారి ప్రాముఖ్యత, ప్రభుత్వాదరణ ప్రపంచమునకు వెల్లడిజేయుటయేగాక, గ్రంథాలయోద్యము మానవసాధమునకు పునాదియనుమాటను రుజువుచేయగలిగినదీ రష్యా ఈదేశములో జాతి మత: వివక్షత లేక నందరికి ఉచిత నిర్బంధప్రారంభ విద్య విధిగా నేర్పబడును. తల్లిదండ్రులు తమ బిడ్డలను పాఠశాలకు బంపనియెడల శిక్షకు గూడ బాత్రులయ్యెదరు. ఉన్నతవిద్యగూడ నుచితముగానే యొసంగబడును. వైజ్ఞానిక, రాజకీయ సాంఘికములన్నిటిలోను పురుషుల కున్న సర్వహక్కులు స్త్రీలకుగూడ గలవు. చంటిపిల్లతల్లులకు, శిశువులకు ప్రత్యేక ప్రభుత్వరక్షణగలదు. ప్రజలందరు సైనిక శిక్షణకు, సేవకు సంసిద్ధులైయుండవలెనను ప్రభుత్వాజ్ఞను రష్యాదేశీయులు ఆదరణతో స్వీకరింతురు.

## అమెరికా

ప్రపంచమందున్న యన్ని దేశములకంటె ధనవంతులకు నివాసమై తులదూగుచున్న దీదేశము. నాగరికతకు, నూత్నవిద్యాపద్ధతులకు బ్రసిద్ధిజెందిన దీదేశము. అనేక గ్రంథభాండాగారములకు, జాతీయసంస్థలకు కోట్లకొలదిరూప్యముల ధర్మముజేసి, దానమూర్తి యనియు పేరు ప్రతిష్టలు గడించిన "ఆండ్రూ కార్నీజి" మహాశయుని జన్మదేశమీదేశమనియు ఈదేశములో గ్రంథాలయోద్యమ మెట్లు అంధులకు, చెవిటివారికిగూడ సహాయపడుచున్నదో గమనింతము. విద్యావిహీనులీ దేశములో గానరారనియే జెప్పవచ్చును. "ఏల్"అను పట్టణములో"స్టెర్లింగ్ మెమోరియల్ గ్రంథాలయము"లో 35 లక్షల అచ్చుపుస్తకములున్నవి. అనేకవార్తాపత్రికలు, గంటగంటకీ గ్రంథభాండాగారమందలంకరింపబడుచుండును. అనేకరకముల కరపత్రము లిందు గానగును. ప్రజలను గ్రంథాలయమువైపున కాకర్షించు పరికరము లనేకము లీ గ్రంథాలయమునగలవు.

"వాషింగ్టన్" నగరమున "వాషింగ్టన్ కాంగ్రెసు గ్రంథాలయమొకటి గలదు. అందు 25 లక్షల పుస్తకములు గలవు ఇంకను 10 లక్షల గ్రంథములకు తక్కువలేని పెద్ద గ్రంథాలయములు గలవు. ఇతర చిన్న గ్రంథాలయము లెన్నియోగలవు. ఈదేశమున గ్రుడ్డివారికి చెవిటివారికి నుపయోగపడు ప్రత్యేక గ్రంథాలయములుగలవు. గ్రుడ్డివారు స్పర్శజ్ఞానముచేతనే ఉబ్బెత్తుగల అక్షరములు తడుముటవలన వాటిని గుర్తించి చదువనేర్చు విధానమొకటిగలదు. రెండవది "గ్రామఫోన్"వంటి "గ్రంథఫోన్" అనునొక యంత్రమును గనిపెట్టిరి. అమెరికన్ లైబ్రరీకాంగ్రెసుయొక్క 1935 సం॥పు సమావేశమునందు గ్రుడ్డివారికి వాషింగ్టన్ నగరమునందేర్పరచిన అమెరికన్ ఫౌండేషన్ సంఘమువారు యంత్రములను తయారు జేయుటకు ఒక బడ్జెటును ఆమోదింపజేసిరి. మాట్లాడు పుస్తకరికార్డులను తయారు జేయుటకుగాను రు 11 లక్షల 25 వేలును, 5000 యంత్రములను తయారుజేయుటకుగాను రు. 31 లక్ష, 72 వేల 5 వందలును గ్రాంటుచేయబడినవి. 500 అడుగుల ఫిలిం మీద యొక నవలనుగాని, యొకచిన్న చరిత్రనుగాని రికార్డుచేయవచ్చును. మెషీను మీద విరామములేకుండ, ఫిలిమును త్రిప్పుచు నవలనుగాని, చరిత్రనుగాని, ఒకేమారు చదివించుటకు వీలగును. ఈ రికార్డులు ఈ దేశములో విరివిగా ప్రచారమందున్నవి. గ్రుడ్డివారికి సైతము ఇట్టి సేవజేయురికార్డులు గల గ్రంథాలయము లీ దేశములోనుండ సామాన్యగ్రంథాలయము లింకెట్లున్నవో పాఠకుల గమనికకువదలి వేయుచున్నాను.

నీగ్రోలు

ఈ దేశముయొక్క ఆదిమనివాసులగు యీజాతి మృగప్రాయులుగానున్న రోజులు కొన్ని గలవు. తెల్లదొరల తుపాకీగుండ్లకు అటవీ మృగములవలె బలియైన రోజులు మరికొన్ని గలవు. సంతలలో పశువిక్రయములవలె యీజాతిని యొకదేశమునుండి మరియొకదేశమునకు బానిసలుగ విక్రయింపబడిన రోజులు ఇంకకొన్ని గలవు. ఇట్టి జాతెట్లుద్ధరింపబడినదనే విషయము ఆదేశ చరిత్రలబట్టి చూచిన విశదము గాగలదు. ఈజాతిలో నేయొక మహాపురుషుడవతరించినాడు. ఆమహానీయునినామము నీగ్రోలు నేటిదనుక జపించుచుందురు. ఆవీరశిరోమణి యెవరు? అతను "వాషింగ్టన్" మహాశయుడు. ఈతనిచేతనే యీజాతి దాస్యమునుండి యుద్ధరింపబడినది. మొదట నీజాతిలో అక్షరజ్ఞానముగలవారు గాని భాషాజ్ఞానము గలవారు గాని మచ్చునకొక్కరైనను లేకుండిరి. విద్యగరపుటగాని విద్యనేర్పుట గాని దండనార్హమై యుండెడిది. 1865 సం॥ డిశంబరు 12 తారీఖున నీగ్రోల దాస్యవిముక్తి శాసనాప్రభుత్వమువలన చేయబడినది. వీరికొరకై అనేక గ్రంథాలయములు, విద్యాలయములు నెలకొల్పబడినవి. 1865 సం॥ మొదలు 1930 సం॥ వరకు అనగా

65 సం॥లలో వారిలో గలిగిన విజ్ఞానవిశేష మపారము. 1930 సం॥ లెక్కలను తిలకించినచో వారిలో నిరక్షరకుక్షులు 100 కి 16 మంది మాత్రమే గనపడుచున్నారు. దీనికి గ్రంథాలయోద్యమ మెంతయో తోడ్పడినట్లు తెలియుచున్నది. గ్రంథాలయ సేవ అమూల్యాభరణమను మాట మరువ గూడదు.

ఒకప్పుడు సర్వప్రపంచమునకు జ్ఞానభిక్ష బెట్టిన భారతదేశములో బుట్టినాము. మనకు పురాతనమైన భాషలును, లిపులును, అక్షరములును అనేకములున్నవి. దవియు స్తమింపని బ్రిటిషు వారి పరిపాలనమున్నది. ఇట్టి దేశములో 100కి 91 మంది నిరక్షరకుక్షులున్నారన్న ప్రభుత్వమున కెంత గౌరవమో, మనకెంతగౌరవమో యోచింపదగును. ప్రభుత్వాదరణలేకపోయినను ప్రజాదరణ బొంది అన్నపూర్ణభిక్షులకైనను మనదేశ గ్రంథాలయోద్యమము నోచుకొనిన మనము ధన్యులము కాగలము.

(ఇంకావుంది.)

---

## వ్యాజోక్తి

శ్రీమతి అల్లాడ రామఅహల్యాదేవిగారు

బంటులు లేరు కొల్వగను బంధుజనంబులు గానుపింపరే!
ఒంటిగ నుండెదీవు ముదమొల్కగ బల్కగ లేరు మిత్రులున్,
కంటను నీరువెట్టకనె కాపురముందు వపారవార్ధిలో
గంటిని నీవు లోభివని కార్యములేదిక నాలకాపరీ!
పిసినిగొట్టువె కాకున్న భీతిచేత, నర్థిజనులకు దర్శన మరుదుచేసి
వారు వద్దకు రాకుండ వార్ధియందు, గాపురంబును వెట్టుదే కల్పవేల్ప!
ఆలిచుట్టాలు ధనవంతు లగుటజేసి, వారి సొమ్ములహరియింప వారిలోన
వాసముం జేసెదవునీవు పాపబుద్ధి, నిన్ను నేమన దప్పుండు? నీరజాక్ష!
శత్రువీరుల నెదురించి సమరమందు, చండతేజము మెఱయంగ శౌర్యమొప్ప
నిర్జితుల జేయజాలక నేర్పుమీఱ, వేసములవేసి మాయల వెదకెదీవు!
నీసరి వారు వీరనక నీచులనెల్లర జెట్టపట్టు తా
వీసము నుచ్ఛనీచముల పేరయినం దలపెట్టకుండనే
రోసము మాటటుంచుమిక రోయకయుక్కున జేర్చికొందువీ
వేసము గాంచ నెంచదొకో వెంగలిగా నిను విశ్వమంతయున్.
నీదుసుతుడుచూడ నీచుండు సరిగదా, పజ్జనుంచువాడు వదరుబోతు
వీరె చాటగలరు వెన్నుడనీదగు, గౌరవంపుబేర్మి ఘనముగాను !!




## శాస్త్రి హోటలు అనగానేమి?

ఆరోగ్యభాగ్యమునిచ్చు ఆహారములకు
అల్పాహారములకు పుట్టినిల్లు.

వీర్యబలమునిచ్చు మధురపదార్థములు, చలిదేశమునకు అనుకూలమైన శయ్యాగృహములు,
దంపతులకు తగిన యేర్పాటులు.

## శాస్త్రి హోటలు

89 చిక్ పేట — బెంగుళూరు సిటీ.

## సంఘసంస్కారమా!…

జి. గోపాలరావుగారు, బి.ఏ.



విశాలాక్షి మొదటి పేరు సర్వలక్ష్మి అయినా విశాలమైనముఖంలో చాఅడేసికనులు ఆమెకీ పేరును సార్థకం చేసాయి. మాయామర్మ మెఱుగని ఆమె చిన్నిహృదయంలో ఎట్టి ఆలోచనలున్నవో ఆమె కనులలో ప్రస్ఫుటమయ్యేవి. ఆమెకన్నుల్లో దివ్యశోభ వెలిగేవి. ఆజ్యోత్స్నావీధుల్లో ప్రేమ తాండవించేది.

విశాలాక్షి పెండ్లికాలానికి ఆమెకు పదమూడవ యేడు నడుస్తూంది. చెన్నపట్నంనుంచి రామారావు ప్రత్యేకంగావచ్చి విశాలను చూచుకొనివెళ్లేడు. తామరపూవులాంటి ముఖంమీద తుమ్మెదల్లాంటి కనులుచూచి రామారావామెను నచ్చలేదనడం యెలాగ. ఆమె కడగంటిచూపుకు తన సర్వస్వముతో పట్టుబడ్డాడు. వాటిల్లోనే ఆమెహృదయాన్ని చదువుకున్నాడు.

తెనాలి స్టేషనుమాష్టరుగారి కుమార్తెను చూచి రమ్మని మొదట తనతండ్రి వ్రాసినపుడు అతనికి అయిష్టతగానేవుంది. చదువు పూర్తయేవరకు పెండ్లి చేసుకోనని చెప్పేవాళ్లలో రామారావొకడు. కాని తండ్రి బలత్కారముపై విశాలను అతడు చూచినమీద వివాహము చేసుకుంటే ఆఅమ్మాయినేతప్ప యితరుల చేసుకోననే రాజమండ్రి వ్రాసేడు. రామారావు గౌరవమైనకుటుంబములో పుట్టేడు. బి.యే. ప్యాసయి చెన్నపట్నంలో రెండవ యం.బి. చదువుతున్నాడు. సంఘసంస్కరణాభిలాషి. చిన్నప్పటినుంచీ స్వాతంత్ర్యజీవి. కుటుంబానికి వొక్కడవడంచేత అల్లారుముద్దుగా పెరిగేడు. రామారావే పిల్లనో వోపిల్లను నచ్చేడు అనడంతోటే కుటుంబరావుకు సంతోషమయింది. అతడు సబుజడ్జిగా రిటైరై రాజమండ్రీలో స్వగృహములోనే విశ్రాంతి తీసుకుంటున్నాడు. తన హోదాకు తగినట్టుగా ఆసంబంధము నిశ్చయం చేసుకున్నాడు.

ఆవేసవిలో ప్రసాదరావు వివాహంచేసేడు. తన స్నేహితులమధ్య సంఘంపెద్దలమధ్య, గౌరవనీయుల మధ్య రామారావు కాళ్లుకడిగి విశాలను ధారపోసేడు. సంఘమర్యాదలన్నీ పాటించేడు. ఉద్యోగస్థులకు విందుచేసాడు. వివాహానికి అయిదువేలు వదిలేయి అతనికి. ఎంతధనము వ్యయమైనా తగినవారితో వియ్యమందేనుకదా అని అతడు సంతుష్టిచెందేడు. రామారావు విద్యావంతుడు. తన ముద్దుబిడ్డ సుఖిస్తుందనుకున్నాడు.

ఆరోజులు గడిచేయి. ప్రసాదరావుపై చిన్ననేరమారోపించి అతన్ని మరో చిన్నస్టేషనుకు బదలాయింపు చేసారు. ప్రసాదరావు సహజముగ ధీరుడు. కుమారున్ని మద్రాసు ప్రెసిడెన్సీకాలేజీలో బి.యే. క్లాసులో ప్రవేశపెట్టి భార్యతోను విశాలతోను తన స్టేషనుచేరుకున్నాడు. ప్రకృతిశోభలో నిర్మల వాతావరణమున కనుగుణ్యమైన స్వేచ్ఛాజీవనానికి.

ii

కాలచక్రం తిరిగిపోతూంది. విశాల రజస్వలయి సంవత్సరము ఆరుమాసములవుతుంది. ఆమెను సారె తీసుకువెళ్లలేదు. రామారావుచదువు పూర్తికావాలన్నాడు. అతడి సంస్కరణాభిలాష దీక్ష వహించింది. అతని కాలేజీ వుపన్యాసమందిరమున అతడు తన వాచామాధురిని రుచిచూపించేడు. వ్యక్తి స్వాతంత్ర్యమును గ్రహింపుడని అతనిబోధ. ఆరోజుల్లో అతని వ్యాసములతో నిండని పత్రికలేదు. మత దౌర్బల్యము సంఘదౌష్ట్యములో వ్యక్తిగత స్వాతంత్ర్య



శ్రీమతి ఎ. సావిత్రీదేవిగారు, శ్రీమతి కె. జానకిదేవిగారు
ఈ సంవత్సరము హైదరాబాదు బాలికల ఉన్నతపాఠశాలనందుండి
బొంబాయి విశ్వవిద్యాలయమునందలి లలితకళలపరీక్షయందు
కృతార్థులైనవారు.



మిత్రప్రేమ



బొంబాయి విక్టోరియా గార్డన్సునందొక దృశ్యము.

మెల్లా నశించిపోయిందో ద్యోతకమయ్యేది. అతని ఉపన్యాసాల్లో. స్వార్థపరుడగు మానవుడు యెట్టి నైచ్యమునకు దోసిలొగ్గిందీ ప్రస్ఫుటమయ్యేది.

ఆనాడు నివాసమందిరమున అతడు కూర్చొని వున్నాడు. బంట్రోతుపిల్లవాడు 'చిన్న కార్డు' అతని చేతికిచ్చాడు. 'ఉమాబాల, పస్టుయియరు' అనుకొని నదే అతడు గట్టిగా చదివేడు. ద్వారమువంక తిరిగి 'రమ్మను' అని ఆజ్ఞాపించేడు.

మరో ఐదునిముసములకు యిరువదేళ్ల యువతి ఆగదిలో ప్రవేశించింది.

'నేనురావడం మీకు ఆశ్చర్యంగా వుందనుకుంటాను?'

'లేదు. అలాకూర్చోండి ఆకుర్చీమీద.'

'సంఘము-స్త్రీ అని యీమధ్య మీరువ్రాసిన వ్యాసము చదివేను.'

'...........'

'సంఘ సౌభాగ్యానికి స్త్రీ యెంతఅవుసరమో తెలుస్తుంది అందులో.'

'...........'

'పశ్చిమ రాజ్యాల్లో తానొకడైనిలువబడిసామ్రాజ్య స్థాపనకై కంకణముగట్టిన ఇటలీ నియంతను కన్నది స్త్రీ. సుల్తానుచక్రవర్తుల నిరంకుశ ప్రభుత్వదాడి కోర్వలేక స్వాతంత్రవిహీనులై ప్రపంచమున జీవించుటే పాపమని కలవరించు తురుష్కులకు ప్రాణ ప్రతిష్ఠచేసిన కెమాల్ పాషాను కన్నది స్త్రీ. జారు చక్రవర్తుల నిరంకుశత్వమును యెదిరించి పోట్లాడి తుదకు జయించి ప్రజాస్వామిక పరిపాలనమును నెలకొలిపిన లెనిన్‌ను కన్నది స్త్రీ. ఇనుమునకు తుప్పువలె కర్రకు చెలువలె దాస్యభావము ఆత్మశక్తిని నశింపజేయ దురభిమానులై తమున్నదే ప్రపంచమని జీవించు నేటి భారతీయులకు ప్రబోధమొనర్చి ఆత్మశక్తి మహిమ కనబరచిన మహాత్ముడు గాంధీనికన్నది స్త్రీ. ఐరిషురాజ్య స్వాతంత్ర్యమునకు కారకుడు డీవెలరాను కనిపెంచినది స్త్రీ......ఈవిషయాలు మీరువ్రాసేరు. అయితే అట్టిస్త్రీ నేడు మనసంఘమున యెట్టిగౌరవమొందుచున్నది? యెట్టివిద్య నభ్యసించుచున్నది? యెట్టిజ్ఞానము నభివృద్ధి పరచుకొనుచున్నది? యీవిషయములు మీరు చర్చించలేదు.'

రామారావు ఉమను కన్నెత్తిచూచేడు. ఆమె శరీరములో వేడిరక్తము ప్రవహిస్తూం దనుకున్నాడు. ఆమె గులాబిబుగ్గలు దాడిమపూవు రక్తిమ వహించేయి. తెల్లనిమోముపై మిలమిలలాడే ఆమెకనులు దీనికి మీజవాబేమిటని ప్రశ్నిస్తున్నాయి. అతడు ఉమ నెపుడు యింతగా పరికించిచూడలేదు. క్లాసులో స్నేహితు లామెవిషయమై చెప్పుకొంటూన్నప్పుడు కూడ అతడు దీక్షతో వినలేదు. నేడు ఆమె వొక వ్యక్తివలె గోచరించినది. దాస్యమునకై ఆమె ఉడుకు రక్తము సహించలేదనుకున్నాడు.

'ఉమా......'

'సంతోషము'

అతడు తన వివశతనుండి లేచేడు.

'క్షమించండి.'

'అవసరములేదు. నేను మీస్నేహమునకై వచ్చేను. స్వేచ్ఛావిహారి అగునోపక్షి తన కలకూజితాన్ని ఆవసంతవాయువులో నింపుతూపోయింది. ఆమె కిటికీలోంచి ఆదారిని చూచింది. ఆమెతల్లో గులాబి 'పకపక' నవ్వుతోంది.

'మీప్రశ్నలకు జవాబు వ్రాస్తాను.'

'నా ఆగడమునకు క్షమించండి.'

'.........'

'మీకు అభ్యంతరము లేకపోతే మరోసారి వస్తాను.'

ఆమె లేచింది.

'మీరు యెక్కడ వుంటున్నారు?'

'హాస్టలు.'

రామారావు ఆసనమునుండి లేచేడు. ఆమె ద్వారము కేసి దారితీసింది.

'మీరు నా వ్యాసములన్నీ చదివివున్నారా?'

'చదివేను. మీ ప్రతీ వుపన్యాసముకూడ నే విన్నాను.'

'మీకు వీలయితే అప్పుడప్పుడు రావచ్చును.'

'నేడు సుదినము—మీ పరిచయము కలిగింది. సెలవు.'

ఆమె వెనుదిరగకుండా రోడ్డుమీది కారులో కూర్చొని వెళ్లిపోయింది. రామారా వక్కడే నించున్నాడు.

సంఘ మామెపై తన దౌష్ట్యము చూపినదా! ఆమె స్వేచ్ఛాజీవనము దానికై బలిఅయినదా!

ఆనాడల్లా అతనికి అదేధ్యాస.........ప్రపంచములోని స్వాతంత్ర్యవాదుల తెలంపునపుడు ఆమె మోము కళ్ళ జ్ఞాపకానికి వచ్చేది. ప్రశ్నార్థకంగా ముడివైచిన కనుబొమలు, స్వాతంత్రపిపాసలై మెరసి పొయ్యే కనులు అతని కింకా ప్రత్యక్షంగా అగుపించేవి.

రెండురోజుల్లో అతడామె ప్రశ్నలకు జవాబు వ్రాసేడు. అంతవరకు అతని హృదయమునకు శాంతి లేనేలేదు.

* * *

ఆమార్చి సాయంత్రము నాలుగుగంటలే అయినా పడమటమబ్బు కమ్ముటచే చల్లగావుంది. రామారావు 'షికారు'కు కారు సిద్ధం చెయ్యమన్నాడు. ఒక అరగంటలో అతడు కారు దరికివచ్చేడు. 'ఉమా బాల'—అతని వెనక మాటలు వినబడ్డాయి. రామారావు తిరిగి చూచేడు. మబ్బురంగుచీరలో ఉమ అతడికి ప్రత్యక్షమయింది.

'మీరు ప్రయాణము నిలుపు చెయ్యనక్కరలేదు.' ఆమె చిరునవ్వుతో అంది.

'కారులో వచ్చుటకు మీకు అభ్యంతరము లేక పోతే రావచ్చు.'

ఆమె అతణ్ణి ఉద్దేశపూర్వకంగా పరికించింది.

'ఎక్కడకు?'

'నియామకంలేదు.'

అతడు ఆమెను ఆహ్వానించేడు. ఆమె 'ఫ్రంటు సీటు'లో అతనిప్రక్క కూర్చుంది. రామారావు కారు నడిపేడు. ఆమె హృదయంమాత్రం కారు వేగముతో సరిగ నడుస్తూంది.

'బేసిన్ బ్రిడ్జిరోడ్డు కేసి వెళ్లాలనుకుంటున్నాను.'

ఆమె హృదయవేగము సర్దుకుంది. ఆమె మనసులోని వొక్క ఆలోచన అదే—వూరువిడిచి అతడు కారును యెక్కడికేనా పోనిస్తే బాగుండుననుకుంది.

వూరుదాటి మైలువచ్చేవరకు యెవరూ మాట్లాడలేదు. తర్వాత ఉమ యిలాఅంది.

'సంఘముపేరిట పురుషుడొనర్చు రాక్షసత్వము నెదిరించుటకై స్త్రీకి నేడు విద్య కావాలన్నారు. స్త్రీ నేడు బానిసగా చూడబడుచున్నదన్నారు. స్త్రీపురుష శక్తులు వ్యతిరేకములుగాని, నికృష్ట వుత్కృష్టములు కావన్నారు. పురుషుడామెను వ్యక్తిగా నెపుడు చూచునో, మాతృత్వము, సతీత్వము బోధించు ధర్మముల నెఱుంగుటే స్త్రీవిద్య అనబడునన్నారు. కాని ఆమె వ్యక్తిగానుండుట అవసరమా? అని నాప్రశ్న.'

'లేకున్న పురుషుడామె ఆత్మశక్తిని తుప్ప పట్టించుచున్నాడు. ఆమె నధోగతిపాలొనరించి తన ధఃపతితుడగుచున్నాడు.'

రామారావు కారు నడుపుతూనేవున్నాడు. ఉమ శూన్యంగా అతని చోదన కౌశలమును చూస్తూంది. ఒక అరగంటలో అతడు కారును ఆపి దిగేడు.

'నేను తరచు యీ ప్రదేశానికే వస్తూవుంటాను.'

అతడు దగ్గరగావున్న వో కొబ్బరితోటకేసి దారి తీసేడు. ఉమాబాల అతని వెంటబడించింది.

'కష్టభరితమగు మానవుని జీవితంలో శాంతియుతమగు గడియలనిచ్చే యంత్రము ప్రకృతియేయని వాదించేవాళ్లలో నే నొకణ్ణి.'

ఉమ దానికి అభ్యంతరము చెప్పలేదు.

చల్లని ఆ సంధ్యావాయువులో కొబ్బరిమట్టలు మెల్లగా వూగాడుతున్నాయి. విడుతూన్న మబ్బు వీథుల్లో శుక్రుడు, పంచమినాటి చంద్రరేఖ, దోబూచులాడుతున్నాయి. దూరాన్నిపడమట యింకా దట్టంగావుండే మబ్బుల్లో తటిల్లత ప్రకృతివైభవాన్ని చాటుతున్నాది.

ఉమ ప్రకృతిలో లీనమయినట్లు కూర్చుంది. రామారావు మౌనంగా కూర్చున్నాడు. ఉమతో తన కిట్టి పరిచయము యెందుకకలిగిందో అతనికి ఆశ్చర్యం వేసింది. ఆమె యెవరు? ఆమెకీ సంఘములో యేమికావాలి? అన్న ప్రశ్నలకు తగిన ఆలోచనలే అతనిని అలాకూర్చోపెట్టాయి. అట్టిసమయంలో అతనికి వేరాలోచన్లు తట్టేయి. చిరపరిచితమైన వొక అమాయకమూర్తికై అతని కనులు ఆకాశంలోకి చూచేయి. అప్పట్లో అతనికి గోచరిస్తూన్నవి విషాదభరితమైన రెండు నయనాలు—రెండు ప్రేమజ్యోతులు.

'నా విద్యావిధానముపైని మీ అభిప్రాయమేమి?'

అతడు మేల్కొన్నాడు.

'మీ జీవితరహస్యము వెతింగినగాని నే చెప్పలేను.'

ఆమె బుగ్గలు యెర్రబడినై.

ఆకాశవీధుల్లో బారులు తీరిపోతూన్న కొంగల అరుపులు వారి ధ్యానమును మరల్చేయి.

రామారావు కారుదరికి దారితీసేడు. ఆమెయు నడచింది. ఈసారి ఉమమాత్రం కారు నడుపుతానంది. అతడు నవ్వుకున్నాడు. కారు రామారావు బంగళాముందు ఆగేవరకు ఆమె మాట్లాడలేదు. అతడు ఆమె నాజూకైన ఆకారమును నిదానిస్తూ కూర్చున్నాడు.

ఆమె కారు దిగింది.

'మళ్లీ యెప్పుడు రావడానికి వీలవుతుందో చెప్పలేను. మరచిపోకుండావుంటే చాలు'

ఆమె వున్నట్టుగా అలా అని వెళ్లిపోడానికి సిద్ధమయింది. అతడు ఆటంకపరచినా లాభంలేదనుకున్నాడు. అతడు 'సరే' అన్నాడు.

ఆమె వెళ్లిపోయింది. అతడు చూస్తూన్నాడనేనా ఆమె అనుకోలేదు.

రెండురోజులయింది. ఆనాడు రామారావు కాలేజీనుంచి వచ్చేసరికి మేజామీద జాబు పడివుంది. అతడువిప్పి యిలా చదువుకున్నాడు.

'ప్రేమవిలాస్ నివాసకులకు,

ప్రపంచంలో అభాగ్యురాలని యెవరేనావుంటే అది నేనె అనుకుంటాను. మూడేళ్లప్పుడే నాతల్లి లేదనిపించుకున్నాను. అయితే నేను దానికి విచారించను. ఆ ఆత్మకి శాంతిచేకూరింది ఆమూలంగా. లేకపోతే నాజనకుని చాంధసత్వమునకు ఆమె యెంత వేగవలసివుండునో! నాజనని మరణించిన మూడుసంవత్సరముల వరకు అతని బాపిచ్చి పోలేదు. అతని ఆచారము యేశాస్త్రమునకు సంబంధించినది కాదు. అతనిజ్ఞానము యేవేదమునుండి అనువదించినది కాదు. కులక్రమాగత ధర్మమే ధర్మముగ పరిగణించేడు. అతనితాతకు వంకాయ యిష్టములేదు. అతనికి యిష్టములేదు. వారి ఆచారములకు యెంతో పట్టుదల చూపించేవాడు—యెంతో మౌర్ఖ్యము కనబఱచేవాడు. అలాగే నాకు యెనిమిదివత్సరములు దాటేయి. నాకర్మము మూడింది.

అతని శాస్త్రవాదానికి నేను బలిఅయాను. కులాచార ప్రకారము యేబదియేళ్ల ముదుసలికి మూడు వేలకే అమ్మ బడ్డాను. నా సౌందర్యానికి నాభర్త గర్వించాడు. మరొక వేయిరూప్యములు యెక్కువ వచ్చేయికదా అని నాతండ్రి సంతోషించాడు.

'......ఆరోజుల్లో నాకు కష్టము, సుఖముఅంటే యేమీ తెలియదు. ప్రపంచజ్ఞానము అంతకన్నా తెలియదు. నాకు పదవయేడు ప్రవేశించినది. నాభర్త విగతజీవుడయ్యేడు. నాభర్తచావుకు నేను విచారించలేదు. విచారింపవలసిన అగత్యమువుందనీ నాకు తెలియదు. నన్నుచూసి ప్రజలు యేవో మాట్లాడుకునేవారు. వాళ్లదృష్టుల్లో నేనో వింతమృగమల్లే అగుపించుతా కామోను అనుకునేదాన్ని.

'ఆరుమాసములయింది. నాతండ్రికి దీర్ఘరోగము పట్టుకుంది, నిద్రాహారములు లేకుండా అతడికి ఉపచారములు చేశాను. కొన్నాళ్లకు అతనికి నెమ్మది అయింది. కాని ముఖంలోని అతనివిచార రేఖ నశించలేదు. ఒంటరిగాకూర్చొని అతడు ఖిన్నుడయేవాడు. నేను లేనని కొన్నిసమయాల్లో కంటనీరు విడిచేవాడు. నాతండ్రిలో యీమార్పునకు కారణం కనబడలేదు. అతడు తుదకు ఆచింతతో క్రుంగిపోయాడు—శల్యమయ్యేడు.

'అప్పటికి జీవితంలో అనుభవానికి నేను సంసిద్ధనయేను. ఆనాడుపుదయం నాతండ్రితో మాటాడినపుడు యెవరికో వొక స్నేహితునికి పుత్తరమువ్రాశానని చెప్పేరు. అతడు యింకా అర్థంకాని విషయాలు యెన్నో చెప్పేడు... ఆసాయంత్రము నాతండ్రి ఆకస్మికంగా మరణించేడు. 'నేను పాపిని నాకై చింతించకు' అను అతడి తుది మాటలు నాకు యెంతో దుఃఖాన్ని కల్పించాయి. నాకు నేనె యీసంఘాన్ని యెదుర్కోవాలి అని తెలిసినతర్వాత నాదుఃఖము యెక్కువయింది. నేను ఆరాత్రి యెల్లాగడిపేనో తలచుకుంటే యిప్పటికి భయమేస్తుంది.

మరునాడుపుదయం ఒకరు మాయింటికివచ్చేరు. అతడివయస్సు ముప్పది. అతణ్ణి నేను యెప్పుడూ చూచినజ్ఞాపకం లేదు.

'పార్వతీ' అని అతడు నన్ను సంబోధించాడు. నేను నిర్ఘాంతపోయాను.

'నీవు నేను తాతాసహోదరులం. నీకు మరేమి భయంలేదు.'

తర్వాత అతడు నాతండ్రి దహనసంస్కారములలో నిమగ్నుడయ్యేడు.

ఆరాత్రి అతడు యెన్నోవిషయాలు చెప్పేడు. నాతండ్రి అతడు ఆచారసందర్భాలలో యెప్పుడూ 'లాచోకీ' పడుతూండేవారట. బి.యే. ప్యాసయి కలకత్తాలో ఫర్మ్ మేనేజరుగా వున్నాడు. ఆర్యసమాజముక్రింద తను వివాహంచేసుకున్నాడు. అతడికే మాతండ్రి వుత్తరమువ్రాసేడు. నాతండ్రిఅనంతరము ఆస్తి అతనికే సంక్రమించింది. నాతండ్రి కోరికప్రకారము దినవారాలయినతర్వాత అతడు నన్ను కలకత్తా తీసుకుపోయాడు. సంవత్సరములబడి చీకట్లో అలవాటు అయినవానికి వెలుతురు యెట్లావుంటుందో నాకు ఆరోజుల్లో అక్కడివునికి అలా అనిపించింది. అతడు నన్ను ముద్దుగా 'ఉమ' అని పిలిచేవాడు. ఎన్నో సాంఘికవిషయాలు చెప్పేడు.

అప్పటికి నేను పురాణకథలు చదవడం నేర్చుకున్నాను. నాకు క్రమంగా చదువుమీద ఆశపుట్టించాడు. నేను చదువు సాగించాను. అది జయప్రదంగా నడచింది. నేను యింటరుమీడియటు ఫస్టుక్లాసులో ప్యాసయేను. నాఅన్న అపరిమితంగా సంతోషించాడు. నేను తనచెలియలైనందుకు గర్వించాడు. నా స్థితివిబట్టి సంఘానికి వేరొకరీతిగ వుపకరించలేననుకున్నాను. 'మెడిసిన్' చదువుతానన్నాను. నాఅన్న అభ్యంతరపెట్టలేదు. ఈ యూనివర్సిటీలో జాయను అయేను. నాఅన్న నాకు సొమ్ము పంపుతున్నాడు.

ప్రపంచములో నాకాతడొక్కడే ఆప్తుడు. అతడు నన్ను చేరదీయకపోతే యీసరికి నేను యేమయి వుండునో నాకు తెలీదు......

నాచనువువిషయమై మీరెలా అనుకున్నా సరే నేను మీ స్నేహము నభిలషించాను. ఈ సాయంత్రము నాలుగున్నరకి మీబంగళాకొస్తా. ఎటు వెళ్లిపోవద్దని కోరినందుకు క్షమాపణ......'

రామారావు వుత్తరం ముగించాడు. అప్రయత్నంగా అతనిదృష్టులు గడియారముమీదికిపోయాయి. అతడు కిటికీదరికిపోయి నించున్నాడు. పడమట సంధ్యారేఖల్లో అతనిదృష్టులు లీనమయేయి.

రామారావు తనధ్యానమునుండి మేల్కొనేసరికి గదిలో 'లైటు' వెలుగుతున్నాది. గడియారము యెనిమిదికొట్టింది. అతడు ద్వారముకేసి తిరిగేడు.

'వెంకటస్వామి.'

సేవకుడువచ్చి నించున్నాడు.

'ఆమెవచ్చినదా?'

'లేదు బాబూ.'

అతడు తన ఆతృతకు ఆశ్చర్యపోయాడు. ఉమ అతనిహృదయంలో స్థానమేర్పరచుకొందని అతడు గ్రహించాడు.

iii

ఉమా రామారావులపరిచయం గాఢమయింది. వారి సాయంత్రపువిహారాల్లో ఉమ అనేకవిషయాలు అతనితో చర్చించేది. రామారావామె విజ్ఞానమునకు అంతు గ్రహించలేకపోయాడు. రోజుకరోజు ఆమె గభీరంగానే వుండేది. రోజుకరోజు ఆమె అపూర్వంగానే అతడికి అగపడేది.

సంఘములో ఉమ వునికిగూర్చి ఆలోచించినపుడు మాత్రం రామారావు వూహాప్రపంచములో గాలివాన రేగేది. అతని ఆలోచనాశక్తి లేవుగానక కొట్లాడేది.

కాని విశాల అతని దృష్టిపథమునుండి తప్పిపోలేదు. ఆమెకన్నుల అపూర్వశోభ అతనిహృదయసీమలో యిప్పుడుకూడ వెలుగుతున్నాది. వివాహమైనతర్వాత రామారావామెను రెండుసార్లుమాచేడు, ఆరోజుల్లోని ఆమె అమాయికమూర్తిని అతడు మరచిపోలేదు.

అయితే ఉమవలె ఆమె స్వాతంత్ర్యపిపాసిని కాదు. ఆమె కవులుపోలికతెచ్చే వొక లతవంటిది. విశాల వొక అడవిమల్లి. అది ప్రాకడానికి వొక వృక్షం కావాలి. కాని ఉమ అతనిదృష్టిలో వొక గులాబిపాద. స్వభావసిద్ధమగు ముండ్లకై అతడు జడవలేదు. సర్వజనప్రమోదమై అందరికీ ముట్టరాని దాని వ్యక్తిత్వమే అతణ్ని ఆకర్షించినది. ఉమ అతనిహృదయము జయించినది. మొదట్లో రామారావునకావిషయం ప్రస్ఫుటంకాలేదు. కాని ఉమ అతని దరిలేనిసమయాల్లో అతని హృదయారాటము మనోవైకల్యము అతనికి ఆసంగతి స్పష్టపరిచాయి. ఆమె మనోహరాకృతిని చూడకుండా ఆమె వాచామాధురి వినకుండా వుండలేకపోయాడు.

ఆనాడుసాయంత్రము చాలవరకు రామారావు ఉమకోసరము మాస్తూ యెక్కడికివెళ్లలేదు. వెంకటస్వామి యేదోపనిమీద మైలాపూరువెళ్లేడు. రామారావు మేడమీద ముందువసారాలో మేజాదగ్గర కూర్చున్నాడు. ఉమ అతడు నాడు సినిమాకి వెళ్దామనుకున్నారు. కాని ఉమ రాలేదు. పడమట మబ్బు మీకుల్లో అస్తంగతమార్యుడు ప్రకృతివైభవాన్ని చాటుతున్నాడు. మేడయెత్తుకి యెదిగిన పోకచెట్ల రెమ్మలు గాలికి చప్పుడుచేస్తున్నాయి.

ఏడుకొట్టేముందు ఉమ వచ్చి అతనికి యెదురుగా కూర్చుంది.

'సినీమాకి వెళ్లటానికి వీలయిందికాదు...కొన్ని కారణములచే వేగంరాలేక పోయాను...'

అతడు దానికి యేమిజవాబు చెప్పలేదు.

'వారంరోజుల్లో మాఅన్న యిక్కడికి వస్తాడుట'

'.............'

'ఏదో కంపెనీపనిమీద వస్తున్నాట్ట. అప్పుడు మీపరిచయంకూడ చేస్తానని వ్రాసేడు.'

ఆమె మామూలుగా అంది.

ఉమ తర్వాత మాట్లాడలేదు.

రామారావు ఆమెవేపు సాలోచితంగా చూచేడు. ఉమ వొక శక్తిపుంజమని అతనిభావన. ఆరూపంలో లోకమాతయగు ఉమాదేవి అనే ఆమెను తలచేవాడు. కాని అనుకున్నఫలము కావాలంటే ఆశక్తులు పని చేయడానికి వొకయంత్రము వుండాలని అతడు అను కున్నాడు. కొద్దిరోజులక్రిందటే ఉమ అతన్ని ప్రశ్నించింది—'పరస్పరబాంధవ్యములేనిదే స్త్రీపురుషశక్తులు కార్యసిద్ధి నందగలవా' అని. రామారావామెకు జవాబుచెప్పాలి. అతడు నేటివరకు దాని విషయమైయ్యే ఆలోచిస్తూన్నాడు.

హాల్లో దీపకాంతులు వారిముఖములమీద పడు తున్నాయి. రామారావు ఉమ మొగంలోకి చూస్తు న్నాడు. ఆమె కన్నెత్తి అతనివేపు చూచింది. ఉమ తనదృష్టుల మరల్చుకోలేక పోయింది.

'పరస్పరబాంధవ్యములేనిదే కార్యసిద్ధినందజాలవు' అని ఆమెకు జవాబుచెప్పేడు. ఉమపాణి అతని చేతుల్లో నలిగిపోతూంది. ముందుహాల్లో గడియారము అరిగంటకొట్టింది. ఉమ తనచేతిని తీసుకోడానికి ప్రయత్నించలేదు. ఆమెకనుల్లో ఏదో వొక అపూర్వ జ్యోతి వెలుగుతూంది.

iv

విశాల రామారావనుకున్నంత మూఢురాలు కాదు. స్కూలుకువెళ్లి తర్డుఫారమ్మువరకు ఆమెనేర్చినవిద్య అలావుండగా ప్రసాదరావువల్ల ఆమె అనేకసారస్వత విషయాలు నేర్చుకుంది, హిందూరమణికి కావలసిన జ్ఞానము ఆమె అలవరచుకుంది. ఆమె వీణ వాయించ గలదు. మిషనుపై కుట్టుకేర్చుకుంది. అయితే యిరువ దవశతాబ్దియందలి మానవుడు కేడు ఆక్రోశించే స్వాతంత్ర్యేచ్ఛమాత్రం ఆమెలోలేదు.

ప్రకృతిశోభాపరిపూర్ణమైన తనతండ్రి స్టేషనులో ఆమె రామారావుకై నిరీక్షిస్తూంది. గుబురుగాపెరిగి విరియబూచిన రాధామనోహరం పూలలో ఆమె ప్రేమ ప్రకటితమయింది. మామిడిచెట్టుమీది కోయిల 'కుహూకుహూ' ధ్వనములో జామిచెట్టుమీద ఫలముల మెక్కి ఆనందాన్ని వెలిబుస్తూన్న గండురామచిలుక పలుకుల్లో ఆమెప్రేమ పలవరించినది.

రామారావువ్రాసిన వ్యాసములు విశాల చదివే వుంది. ఇంటిఆవరణలో గులాబి జామిచెట్లు మొదల వాలుకుర్చీలోపరుండి ఆమె వాటిని 'వల్లె' వేసేది. తనకు అర్థంగానివిషయాలని ఆమెతండ్రితో చర్చిస్తూ వుండేది. అతనిఆశయముల కనుగుణంగా నడవగలనా అను అధైర్యము ఆమెలో యెపుడూ కలగలేదు. కాని రామారావుకి ఉమతో పరిచయమయింది అని ఆమెఅన్నవల్ల విన్నమీద కొంచెము జంకింది. రామా రావు సంఘసంస్కరణాభిలాష యీపరిచయాన్ని యెట్టి పర్యవసానమునకు తెస్తుందోఅని ఆమె మొదట్లోనే అనుకుంది.

ఉమా రామారావుల పరిచయాభివృద్ధి గోపాల రావు యెప్పటికప్పుడే ఆమెకు తెలియచేస్తున్నాడు. ఒక్కొక్కనాటిజాబులోని విషయాలని తలచు కుంటూ వసారామెట్లదరి నిలువబడిపోయేది. సంజ వెన్నెట్లో తలవాల్చిన సూర్యకాంతము నిశ్చేష్టితమైన ఆమెపాదమును నాకబోయే ఉడుత ఆమెకై జాలిని వెలిబుచ్చేవి. స్టేషనులోకివచ్చి పోయేబండ్లకేసిచూస్తూ ఆమె గంటలకొలది బంగళా లోగడపలో నిలువబడి

పోయేది. వసారాలో క్యాంపుకాటుపై పడుకొని 'కటకటా'లకు తగులుతూన్న కుంకుడుచెట్టు కొమ్మల్లోంచి చంద్రునిచూస్తూ ఆమె రాత్రి యెంతోసేపు మేలుకొనేది. దూరాన్ని సిగ్నలుమీది 'రెడ్ లైట్' ఆమె నిదురలేని తనకళ్లతో యెన్నోరాత్రుళ్లు చూస్తూండేది.

ప్రసాదరావామెస్థితికి చాల దుఃఖించేవాడు. విశాల తన ఆరోగ్యవిషయమై శ్రద్ధవహించలేదని ప్రసాదరావు ఆమెను యెన్నోసార్లు మందలించాడు. కాని ఆమెహృదయంలో మెసుగుతూన్నది ఉమా రామారావుల స్నేహమే. అంతకన్న ఆమెను వేరాలోచనే లేదు.

ఆరోజువుదయం విశాలముందు హాల్లో 'పాశ్చాత్య భావప్రపంచము' అనేపుస్తకము చదువుతూకూర్చుంది. పోస్టుజవాను కవరు అందించిపోయాడు. అందులో గోపాలరావు యిలా వ్రాసేడు.

'ఉమా రామారావులకు మొన్న వివాహమైంది. ఉమ అన్న కుటుంబరావుగారు యింకా కొంతమంది పాల్గొన్నారు. అంతశ్శాఖావివాహమనీ వితంతు పునర్వివాహమనీ ఆదర్శనీయమైన సంస్కారమనీ అందరూ శ్లాఘించేరు. తనకోడలని వదలిపెట్టడానికి కారణము ప్రసాదరావేఅని ఆరిటైర్డు సబుజడ్జి సాకు చెప్పేరు. 'ప్రేమవిలాస్' బంగళాలో నిన్న టీపార్టీ జరిగింది. ఆతర్వాత జరిగినసభలో రామారావు సంస్కారము నగ్గడిస్తూ వొకరు ఉపన్యసించేరు.'

విశాల నిశ్చలంగా కూర్చుంది.

స్టేషనునుంచి ప్రసాదరావు అప్పుడే హాల్లో ప్రవేశించేడు. విశాల తండ్రికి ఉత్తరము అందించినది.

'పత్రికలోకూడ పడ్డాదమ్మా' అంటూ అతడు నిలువున నీరయేడు. విశాల తెల్లబోయి అతనికేసి చూస్తూంది. సంఘమునకయ్యే అయిదువేలరూప్యములువెచ్చించి గొప్పవారి సాఖ్యమునకువోర్చి తన ముద్దుబిడ్డ సుఖించినచాలునని తపించు తన తండ్రిని సంఘసౌభాగ్యమునకై స్త్రీకి నియమితమైన ప్రత్యేక స్థానమును జయప్రదముగ సమర్థింపబూనిన ఆమెను, కాదనియొనర్చిన రామారావు సంస్కారము నిజానికి సంఘసంస్కారమా? సంఘద్రోహమా? అని ఆమె హృదయములోని వొక్కఆలోచన. ఆ విశాలనయనాలలోని వొక్కప్రశ్న'!!

---

# కాశ్మీర మజిలీలు

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

## బంగారుగుడి

### ౧

మిన్నువీఁది వింతవింత ముగ్గులను, అవిరళస్వర్ణకిరణవర్షమున తనివార తాన మాడు స్వర్ణాలయమును, నలువలకులందు కాంతిలు రమ్యభర్మదృశ్యములను విలోకించుటకు రెండు కన్నులు చాలవు. శిరము చుట్టు నెన్నరాని కన్నులున్నచో, నొకే పర్యాయము వీనినన్నిటిని వీక్షించుట సాధ్యము. ఒక్కముహూర్తమున వీనిచే కనువిందొనరించుకొన నాతురంపడువారి యాశయము పూర్ణమొనరించుటకై నిజ హృదయమున కెనయైన నిండు కొలంకున జగదీశుడు కడుకౌశలమున వీనిని ప్రదర్శించినాడు. నిండుకొలువునఁగూడిన సుందరాంగులట్లు, ఉదయసాగరమున మునిగితేలు బహువిధ శకుంతసంతానమువలె సర్వ దృశ్యములు సమ్ముఖమందలి హ్రదమున ప్రతిఫలించినవి. కలసిమెలసి యుండియు, వ్యక్తిగతసౌందర్యమును వ్యక్తీకరించు సప్త రాగములు నీటిపై కాంతిలినవి. ఆత్మజీవనమున మానవుడు కాంక్షించు మహాదాశయప్రభా కలితదృశ్య మిట్లే ఎనలేని హొయలున నొప్పారును. ఇందు భేదాభేదములు అక్కసెల్లెండ్లవలె వెలయును. ఏడు రంగుల నీశ్వరు డొక్కమాఱు సరస్సున రంగరించివేసినచో గనులపండు వొనరించు యందము,—డెందము నలరించు నందము నే డిందు తోఁచెడిదా? ఒక్కొక్కరంగు ఒక్కొక్క తరగితలపై చిందులుత్రొక్కుచు, లెక్కలేని తళుకులను తొలకాడజేయు చున్నది! ఒక్కబెళుకు చూడ్కియం దెన్ని రూపుల సృష్టింపగలదో! ఒక్కొక మయూఖమునుండి, సగరసంతానమువలె నుదయించు తళుకుగుంపు, బహుశిఖిపించికా సంపర్కము కలన ననంతభావములను కని మనుష్యహృదయమును డోలిక గావించి వానినందు జ్జూత లూగించుచున్నవి. మానససరోవరమున తలలు ముంచియుండు మరాళములమాడ్కి, సరస్సున నిదురించు కెరటాలు కరువలి తాకుడున మేలుగాంచి కులుకుచు, గుసగుసలు సలుపసాగినవి. హేమాలయప్రతిబింబము కొల్లలైయున్న యలలందూగుచు, దివ్యజలాశయమున నూగాడు అద్భుతజలయానము లీల తోఁచినది. దానిని తిలకించుతఱి మేనబులకలు పొడసూపినవి. దానితో హృదయ మూఁగాడ దొరకొనెను. పదునాలుగు భువనములందలి యందమంతయు నాటి సంధ్యాసమయమున నందు విడిచి నేర్పఱచుకొనినది! ఆహా! అదెట్టి యద్భుత దృశ్యము! అత్తింటగాలిడు క్రొత్తపెండ్లి కొమరితవలె నది హృదయగవాటము తెఱచి, లోపల ప్రవేశించి, దానిని నిత్య

భావలక్ష్మీనివాసము జేసివేయదా? దృక్కులచే నక్కరములను భేదించి, వానియందలి సుందరసృష్టినిగాంచి యలరువారెందరుందురు? ఉదాసీనులను, నిష్ఠురులను సయితము కదలించి వారి మనసుల నానందముచే, అవ్యాజానురాగముచే నిండించు దృశ్యమే విజ్ఞానప్రదాయిని. ప్రత్యక్షమై ప్రసన్నదృష్టిని సారించు సరస్వతి ఇదియే! "నీదానను సుమా! "నన్నేలుకొనుమా! నన్నేలుకొనుమా?" యను నిల్లాలివలె కట్టెదుట దోచు నిట్టి సుందరదృశ్యమునకు కనులప్పగించి, దాని నాత్మసంశ్లేషమున జేర్చుకొని కడలేని హాయిని, తుదలేని విజ్ఞానమును పడయుటకు హృదయముగల ప్రతివానికిని సాధ్యము.

ప్రతిబింబమందలి మహత్త్వ మెట్టిదో యూహింపుడు. ఇది దివ్యశక్తి సమన్వితమైన కవిహృదయము బోలునది. ఈ గుండియ చిన్నదియే! కాని, ఇందనంతభావములు కడలి కడుపులోని మీనములట్లు చలించుచుండును. అనంతమైన వియత్తలము కడుంగడు చిన్నదియైన తటాకమున ప్రతిఫలించు టెట్టి చిత్రమో చూచితిరా? చిన్నచెర్వుపై అసంఖ్యాకములైన నక్షత్రములు ప్రతిఫలించును. కోటిమైళ్లదూరమున కోటికోటిమైళ్ళ రొడమందనరు భువనములు నిక్కముగ చుక్కలేయట్లగపడి చిన్నికోఁటిన నొకే కుటుంబమందలి కుఱ్ఱలట్లు తళ్కొత్తు టెఱుగమా? చోద్యము! "అల్పాక్షరముల ననల్పార్థరచన కల్పించుటయ కాదె కవివివేకంబు" అని కదా పాల్కురికి సోమనాథకవి వచించినాడు! స్వచ్ఛమైన చెరు వొక స్వచ్ఛవాక్కను కొనుడు. అందెన్ని భావభువనములు ప్రతిఫలించునో! ఒకేరూపుగల చుక్కలుకాక పెక్కు రూపులుగల దృశ్యములు దివిభువినుండియు, వైకుంఠనాథుని హరిహిరణ్మయ కుట్టిమముపోలు స్వర్ణమందిరమునుండియు నుదయించిన దృశ్యపరంపరలు నిర్మలసరోవర హృదయమున ప్రతిఫలించి "కవిత్వమన నిట్లుండవలెనోయీ!" అని నాకా మంగళ ముహూర్తమున బోధపఱిచినది. కావున మేలికైతకు మేలుబంతి ప్రతిబింబమే సుడీ యని చదువరుల కెఱిగించుచున్నాను.

నిర్మలమైన పయస్సుతో నిండిన సరస్సుబోలు నదిమనస్సు. మనము విలోకించు దృశ్యములన్నియు నిందు ప్రతిఫలించును. హిల్లోలమట్లు భావోద్వేగము మానసికాచారమును కదలించును. ఇందుండి వెడలు పూరమే కవిత్వమునబరగును. ఇందు సొగసైన ఛాయలుండును గదా! ఇవి లోని ప్రతిబింబము లేజుడీ! ఇట్లని తెలుపకపోయినను వర్డ్స్‌వర్త్ కవీంద్రుడు కవితనుగుఱించి "The utterance of emotion remembered in tranquility" అనినాడు. ఇందలి గభీరార్థమును గమనింపుడు. చిత్రవిచిత్ర ప్రతిబింబములను మనస్సను సరస్సున చేర్చుకొనుటకై నే నీ మజిలీలను సలిపితిని. చిత్తమున నెన్నో చిత్తరువులు తళ్కొత్తి నా కింతింతనరాని యానంద

మొదవించినవి. పాఠకుల హృదయ-హ్రదములందు సుందరశోభిత ప్రతిబింబములను తళ్కొత్తించుట నా యాశయము. నా మనసులోని ప్రతిమలకు ప్రతిరూపులను వారి చిత్తములందు చింతింపజాలు కౌశలమును జగదీశుడు నా లేఖినికి ప్రసాదించునని ఆశపడుచున్నాను.

గంధర్వాంగన హృదయకుధరమునుండి జాల్వారుకలస్వనముకై వడి హేమమందిరమునుండి గీతాలాపనము వెడలుచునే యున్నది. కొండకోననుండి రాలు జలధార లోయలో ఫేన సృష్టిగావించి మంజుల ప్రతిధ్వనులను లేపులీల, నాలయవినిర్గత గానధార నా హృదయకుహరమున మధురరవములు లేపుచు దాని నుద్వేగపూరిత మొనరించుచునేయున్నది. కాసారమున తేలియాడు చిత్రదృశ్యమునకు కనులప్పగించుటచే మదినుదయించు రసస్రవంతియందును, విమలగాంధర్వ సముద్భవోద్వేగమందును నాయాత్మ దొప్పదోగినది. ద్విగుణీకృతోత్సాహము నన్ను పరవశుని గావించివైచినది. కన్నులకును, వీనులకును ఇట్టు లొక్కపరి ఇట్టి విందుగూర్చు ప్రదేశమహత్వమును మఱిమఱి మననము గావించుకొనుచు రెప్పవాల్పక కొంతసే పందు పద్మాసనము వేసికొనియుండి అనంతరము స్వర్గద్వారము జొచ్చు నదృష్టవంతునివలె నల్లన నాలయమున బ్రవేశించితిని. అందలి దృశ్యముకూడ మిగుల మనోహరముగా నున్నది. నుడువులకందని నేరిమి, లోని భర్మశిల్పమున మఱింత యుద్భుతముగా నున్నది. వాతాయనమార్గములనుండి లో జొచ్చు కిరణశాబకములు భిత్తికలపై నృత్యమొనరించుచు శిల్పవిభవమున నపూర్వసృష్టిని దళ్కొత్తించుచుండెను.

గర్భాలయము జనసంకులమైయున్నది. సమ్ముఖమున సిక్కుల పవిత్రగ్రంథ మలరారుచున్నది. దానికి కుడిప్రక్కన వరుసగ నల్వురువ్యక్తు లాసీనులై యుండిరి. చిత్రమేమన నల్వురు నొకేసైజులోనివారే! నలువదేండ్ల వయసువారై యుందురని యూహించితిని. సిక్కుప్రథ ననుసరించియే వారుడుపుల ధరించిరి. పసపురంగుపాగాలు—ఒకే మాదిరివి—వారి శిరములపై వరలుచున్నవి! స్వర్ణమయప్రదేశమున నొప్పునవి స్వర్ణవర్ణముగల యుష్ణీషములేగదా! ఎట్టి సహాకారము! ఎట్టి నేస్తము! ఇర్వురమ్రోల హార్మోనియములున్నవి. శ్రుతివేయుచు వారొకరితర్వాత నొకరు చిత్రవిచిత్రహావభావములతో సంకీర్తన మొనరించుచున్నారు. మూడవవాని చేతియందు సితార్ కలదు. కడుకౌశల్యమున నాతడు దానిని వాయించుచున్నాడు. నాలవవాడు తన శక్తిని తబలాపై ప్రదర్శించుచున్నాడు! ఒకరితోనొకరు సహకరించి, ఆవేశపూరితులై నలువురు గానము సలుపుచున్నారు. వీ రాసీనులైయున్న వైపున పురుషులును, ఎదుటి దిక్కున స్త్రీలును కూర్చుని, వీను దోసిళ్లొగ్గి తనివార గానామృతమును గ్రోలుచు పరవశులై యుండిరి. వీరికిని వారికిని నడుమ

కొంత ఖాళీకలదు. పవిత్రగ్రంథము ప్రోల నొక వెల్లవలువ పఱచబడియున్నది. లోపల ప్రవేశించు దర్శకులు దానిపై తమకు తోచిన పైకమును విసరుచుందురు. కావున నందొక డబ్బులరాశి వృద్ధియగుచున్నది. రాశిపొంత నొకవృద్ధుడు కూర్చొనియుండెను. వానిప్రోల నొక పెద్దపళ్లెరము! పళ్లెమున పిల్లకొండవలెనున్నది హల్వా! డబ్బువేసి యాత్రికు డుపవిష్టుడగుతఱి వృద్ధు డాతనిచేత గొంత హల్వా పెట్టును.

నేను లోపల ప్రవేశించునప్పటికే బుడంకాయిగాడు హల్వాపళ్లెము నాశ్రయించుకొనియున్నాడు. ఎంతసేపటినుండి ఆతడందు తిష్టవేసియుండెనో యెఱుగను. కాని, చిత్తమువచ్చినట్లు హల్వాను మ్రింగుచున్నాడు. రెండు బుగ్గలు పెద్దబూరెలవలె తయారైనవి. వానిదృష్టి పళ్లెమునుండి కదలకుండెను. కొన్నికాసులను పళ్లెమున పడవేసి, గ్రంథము నుద్దేశించి చేతులు మొగిడ్చి పాటకుల సమీపమున గూర్చుంటిని. వృద్ధుడు నాచేత నింత హల్వా ముద్దను ప్రవేశపెట్టినాడు. దెబ్బతో నా గుండెలు దడదడ లాడిపోయినవి. చేబడినది పకోడీకాదు, మఱి బోండాకాదు, పులిహోరయా? అదియును కాదు, ఆమెవడయును గాదు. రామాహరీ! అది హల్వా! పట్టితీపిసరుకు! కారమైయుండినచో మదీయప్రతాపమును ప్రదర్శించువాడను. తీపికిని నాకును సగమెఱుక! నాయొత్తు ధనమును నాకు ఫీసుగానిచ్చినను, నే నీ రకంవారీ సరకును తినుటకు సమ్మతింపను. ఏకారణముచేనైన నది నోటపడినను, అందుండి దక్షణమే బహిష్కృతము కావలసినదే! గొంతుకలోనుండి వేయిమంది బలము కొలది దానిని లోనికి బరబర లాగదలపడినను, అది క్రిందికిదిగుట అబద్ధము! ఈపరిస్థితులు నన్నీవఱలో మార్కొనినవి. ఎన్నిమాఱులో నుక్కిరిబిక్కిరైతిని. ఆయాచితముగ వృద్ధుడు హల్వాను హస్తము నన్యస్తమొనరించినాడు! "హా! దైవమా! ఇపుడు దీనిని నేమిచేతును?" అని పరిపరి విధముల దలపోసితిని. పొట్టిపిచికి చేతుల బెట్టివేయ నూహించితిని. కాని ఆ పాపిష్టి ఘటము మూతిలోగాని, చేతిలోగాని ఇసుమంతయైన ఖాళీలేదు. అయినను, వాని మొగముందే హల్వాముద్దను రుద్ద నుంకించితిని. వృద్ధు డది గ్రహించి, "బాబుజీ! ఆబ్ పాయియే! ఉన్కాఫిర్ దేవుంగా" ("అయ్యా! మీరారగింపుడు. వానికి మరల నిత్తును") అని పలికినాడు. నా ప్లేను పడిందికాదు. అది ప్రసాదము! తిని తీఱవలెను! ప్రసాదమునకు త్రోసిరాజనిన వారిని జుట్టుముట్టు యిక్కట్టులను గుఱించిన విపులవృత్తాంతమును పెక్కుమాఱులు వ్రతకల్పములందు విలోకించియుంటిని. ప్రసాదమును పరిత్యజించుట పరమేష్టిని ఇకసల్లు చేయుట! త్రిశూలమును మీదికాహ్వానించుట! ముప్పుదెచ్చుకొనుటకంటె హల్వా నెట్లో దిగమ్రింగుట మేలుకాదా? ఇట్లొన

రించిన నీశ్వరుడు నాయెడల ప్రసన్నుడై ఎన్నెని వరములిచ్చును. హల్వాకు జడియుట తగనిపని. కావున "నిటలాక్షుండిపుడెత్తి వచ్చినను రానీ,...మత్తేమైన గానీ, పటుదర్పంబున నిలిచి, ఈసరుకు ప్రాణంబేను పట్టించెదరా" అని ప్రతిజ్ఞ గావించి, చివాలున దానిని నోటబెట్టితిని. హా! హతోస్మి! హతోస్మి! అదేటిరుచి! మామూలు హల్వా మాదిరిదికాదు! నాభికమలమందలి ప్రేగులను పెల్లగించి ఈవల బాఱవేయువాసన నాసికారంధ్రములలోనికి గుప్పు గుప్పున నుబికినది! దానిని తిన నలవాటుపడినవారి కది సువాసనయేమో! అందేవేవియో క్రొత్తసరుకులు ప్రవేశించినవి. వారి వాసన నా యుదరగోళమును దొలిచివేయుచున్నది! శ్రీహరీ! ప్రతిజ్ఞ ఎందులకు పట్టితిని? పనేనిరాయుని పట్టుపట్టి హల్వా నోటిలో నిలిచిపోయినది లోపల ప్రవేశించినదికాదు. దీనిదుంపదెగా! మ్రింగవలెనని ఇంచుక ప్రయత్నించినపుడు పటువేగమున వమనము విజృంభింప దలపడినది. ఎంతటి సాహసము! ఎంతయసహ్యము! ఎంతఘోరము! విద్యాధికునివలెనగపడుచు, పదుగురిమ్రోల పవిత్రమందిరమున నంతపని చేతునా? పోయి యివ్వలనుమియుదునా? అయ్యో! అది స్వర్గధామమే! ఉచ్ఛిష్టము వేయుటయంటా? దురంతమైన పాపమునకొడిగట్టుటగాదా? పాపముమాట దేవుడెఱుగును. అంతపని అందు చేసినయెడల సిక్కులందఱు గూడి పచ్చడిచేసి వదలరా? హా! మూలవిధీ! ఇకేమిచేతును? ఏమొనరించుటకు నాకు పాలుపోలేదు. నిర్విణ్ణుడనై యేమిచేతును? ఎందుబోదును? ముదుసలి నన్ను తేఱిపాఱ జూచుచు నావైఖరిని కనిపెట్టుచున్నాడు. "ఏమి యవమానము ఘటిల్లునో దైవమా!" అని యడలితిని. కనులు మూసి మనసును శ్రీహరి పాదరాజీవములకు లగించి, ధ్యానము చేయదొడగితిని. "విఘ్నరోచిష్ణు సహిష్ణు" ప్రార్థించినచో నాతడు నాయెడల ప్రసన్నుడై మదీయరక్షణమునకునై సుదర్శన చక్రమును ప్రుత్తెంచునంచు చదువరులారా! మదితలంచినవాడనైతిని. సూక్ష్మరూపమున చక్రము గొంతుకలో ప్రవేశించి, అందు నిల్వబడియున్న హల్వాను తుక్కతుక్కలుచేసి, తనదు దివ్యప్రభావముకతన దానితోన దృశ్యమగునని యాశపడితిని. "More things are wrought by prayer than this world dreams of" అను టెన్నిసన్ మహాకవివాక్కులత్తఱి జ్ఞప్తికివచ్చి మనసున క్రొంగ్రొత్త యాశను తళుక్కొత్తజేసినవి. పాటకచేరి జరుగుచునే యున్నది. నా యవస్థలో నేబడియున్నను, మధురమంజులగానఝరి మానసకేదారమున పాయపాయలై ప్రవహించుచునే యున్నది. నన్ను నేను మఱచియుంటిని. అట్లెంతసేపుంటినో తెలుపజాలను. కొంతసేపటికి తెప్పిరిలితిని. నోటగలభారము దిగజారినట్లు తోచినది. కనులు తెఱచితిని. బాగుగ స్మృతి వచ్చినది. నే నెంతయో యభిలషించినట్లు నోటిలో మకాము వేసిన "హాపిష్టి"సరుకు అదృశ్యమైనట్లు స్పష్టమైనది. "హే పరాత్పరా! హే కరుణాభూషా! నీ ప్రభావమెట్టిది! నిక్కముగ నీవు శరణాగతరక్షణచక్షుండవోయీ! తండ్రీ!" అని తలపోసితిని.

# నా దక్షిణదేశ యాత్ర

పాలపర్తి రామమూర్తిగారు

నేను కన్యాకుమారినుండి బస్సుమీద త్రివేంద్రం వచ్చితిని. ఇక్కడ మహారాజాగారి భవనములు, సముద్రతీరమునుజూచి తిరిగి మధురకు పయనమైతిని. మార్గమధ్యమున తెంకాశీ అను నొక క్షేత్రమున్నది.

## తెంకాశీ - కొర్తాళం

తెంకాశీ త్రివేంద్రంకు దాదాపు నూరుమైళ్లుండును. పడమటి కనుమలకొండలు అనగా ఘాట్శెక్షన్ దాటగానే తెంకాశీ జంక్షన్ వచ్చును. ఇక్కడికి మూడున్నరమైళ్లదూరమున కొర్తాళం అను చల్లని ప్రదేశముగలదు. తెంకాశీ తిరువాన్కూరు సంస్థానమునకును బ్రిటిషు రాజ్యమునకును సరిహద్దునను న్నది. ఇది తిరువాన్కూరువారిది. ఇక్కడినుండి కొర్తాళంకు యాత్రికులు వేనవేలు వెళ్లుచుందురు. కొర్తాళం ప్రకృతిదృశ్యములకు పేరెన్నికగన్నది. ఇక్కడ ఉన్నత పర్వతశిఖరములనుండి జలధారలు క్రింద పడుచుండును. ఈదృశ్యమునుచూచి ఆనందించుటకు, యీ జలపాతములలో స్నానముచేయుటకు యాత్రికులు అనుదినము వచ్చుచుందురు. కొర్తాళం పురాతనమైన శివక్షేత్రము. కొర్తాళంవద్ద యతి ఆశ్రమస్వీకారమును పొందిన మౌనస్వామివారి ఆశ్రమభవనములు గలవు. ఈ యతీశ్వరుడు మన ఆంధ్రుడు, గుంటూరుజిల్లా నివాసి. తెంకాశీ చెన్నపట్టణమునకు 490 మైళ్ల దూరమునను న్నది. దాదాపు రూ 5-0-0 రైలుఛార్జి వుండును.

## పలని

నేను మధురవెళ్లి దిండిగల్ మీదుగ పలని పుణ్యక్షేత్రమును దర్శింపదలచితిని. పలని, దిండిగల్-పోదనూరు మార్గమునను న్నది. దిండిగల్ కు పలనికి 37 మైళ్లదూరము. పలని గొప్పశివక్షేత్రము. యాత్రికులు వేలకువేలు అనుదినము వచ్చుచుందురు. పలని చుట్టును కొండలె. ఈకొండలు దాదాపు 450 అడుగులఎత్తుండును. పలనికొండపైన శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర దేవాలయమున్నది. ఈ దేవాలయము కేరళ రాజులచే నిర్మింపబడినదని చెప్పుదురు. దీనికి దృష్టాంతముగ యీరాజాగారు అశ్వారోహణుడై యున్నట్లు దేవాలయముయొక్క ఉత్తరపద్యముపై గానవగును. ఇది చాల ఎత్తయిన పర్వతశిఖరముపై నున్నందున రాత్రిళ్లు కొండమీద మెట్లపొడవునను విద్యుద్దీపములు నక్షత్రమండలమిళితమై నేత్రోత్సవము చేయుచుండును.

నేను స్వామిని దర్శింపవలెనని పూజాద్రవ్యములను గైకొని ఆలయమువద్దకు వెళ్లితిని. అక్కడ మెట్టుమెట్టుకు కోతులు వందలకొలది గుమిగూడివున్నవి. ప్రప్రథమమున కోతులు పైబడునని భీతిజెందితినిగాని యాత్రికులు గుంపులుగుంపులుగా వెళ్లుచున్నందున భయముకలుగలేదు. ఒక్క మెట్లమీదనేగాక గర్భాలయములోకూడ నీకోతులు గుంపులుగుంపులుగా నున్నవి. ఇవి యాత్రికులలో కలిసిమెలసి తిరుగుచుండును. దేవాలయము చాల ఎత్తుననున్నందున ఎక్కుటకు క్రొత్తవారికి చాలకష్టముగానుండును. ఈ పలనికొండలు నీలగిరి కొండల సౌందర్యముతో తులతూగుచుండునని చెప్పవచ్చును. ఈ సుబ్రహ్మణ్యేశ్వరుడు దండపాణియై ఆండిఅను భిక్షుకనిరూపములో ఆరాధింపబడుచున్నాడు.

సుబ్రహ్మణ్యస్వామి చాల మహిమగలవాడని ప్రతీతి. భక్తులు ఆయనకర్పించిన అచేతనపదార్థములు

చేతనముగ మారునని చెప్పెదరు. ఇప్పటికిని మూఢ విశ్వాసము మారలేదు. కొందరు ఇనుపశూలములను నోటికి దేహమునకు గ్రుచ్చుకొని పాదచారులై దేవుని సేవించువారున్నారు. పాలకావళ్లతో వచ్చేవారు కొందరున్నారు.

దేవాలయములో స్వామి దండపాణియై భిక్షుక రూపమున నిలబడియుండును. స్వామిని అర్చించుటకు దక్షిణదేశమంతటను కొంతరుసుము చెల్లించవలెను. వలెను. ఆఆచారమె యిక్కడను గలదు. కర్పూర హారతికి 2 అణాలు. పంచామృత అభిషేకమునకు 2-4-0 లు. స్వామివారి జవహరితో దర్శనము కోరే యెడల రు 7-8-0 లు యివ్వవలసియుండును. స్వామి దర్శనము చేసినవారు పంచామృతమును స్వామిప్రసాదమును గొనితెచ్చెదరు. ఈ పంచామృతపానమువలన బిడ్డలు లేనివారికి బిడ్డలు పుట్టుదురని ప్రతీతి. ఇది శేర్ల లెక్కన అర్చకులు విక్రయింతురు.

ఇక్కడ మంచి సత్రములుగలవు. ఇది మధుర జిల్లాలోనిది.

ఇక్కడనుండి పోదనూరుజంక్షను పోవచ్చును. అక్కడనుండి ఊటీ లేక ఉదకమండలం పోవచ్చును. ఊటీకొండలకుపోవువారు పోదనూరు, కోయంబత్తూరు, మెట్టుపాలియం వెళ్లి అక్కడనుండి ఊటీకి వెళ్లుదురు.

## తంజావూరు

నేను పళనినుండి దిండిగల్లుమీదుగ తంజావూరు వెళ్లితిని. తంజావూరు చాల పురాతనమైన పట్టణము. ఇది చోళరాజుల కాలమునాటి ముఖ్యపట్టణము. చోళ రాజుల తరువాత విజయనగరరాజులు, మహారాష్ట్రులు పాలించిరి. శివాజీ రాజ్యానంతరం ఇది బ్రిటీషువారి స్వాధీనమాయెను.

ఇచట ప్రాచీన హిందూశిల్ప ప్రావీణ్యమును నాగరకతను దెల్పు నిదర్శనములు పెక్కులుగలవు. వీనిలో బృహదీశ్వరాలయమొకటి. ఈఆలయముయొక్క మధ్యశిఖరము చూపరుల నాకర్షించుచుండును, దీని అడుగుభాగము 96 చదరపు టడుగులుండును. గోపురముయొక్క ఎత్తు 207 అడుగులు. గోపురముయొక్క శిఖరము ఒకే నల్లరాతిగుండు. ఈగుండు 25 న్నర చదరపుటడుగుల వైశాల్యముండి 80 టన్నులబరువు గలిగియున్నది. ఈరాతిగోపురమును చెక్కుటకు 12 సంవత్సరములు పట్టినదని చెప్పుదురు. దీని పైన బంగారు నీరుపోసిన కలశములు సూర్యరశ్మికి ధగధగాయమానంబై మెరయుచుండును.

ఆలయముయొక్క ముందుభాగమున బ్రహ్మాండమైన నందివిగ్రహము ప్రతిష్ఠింపబడియున్నది. ఈ బసవేశ్వరుని పొడవు 16 అడుగులు ఎత్తు 12 అడుగులుండును. ఈనందీశ్వరుడు ఒకేశిలమీద చెక్కబడియున్నది. ఈనందిని 400 మైళ్లదూరమునుండి అక్కడికి గొనిరాబడినట్లు చెప్పుదురు. అనుదినము నూనెతో రుద్దుటవలన నిగనిగమని మెరయుచు బ్రాంజి లోహమువలె కనబడును.

ఈ బృహదీశ్వరాలయముయొక్క విశేషమేమనగా గోపురములమీదనున్న విగ్రహములన్నియు విష్ణు సంబంధమైనవి కాని దేవాలయములోపల అన్నివిగ్రహములు శివస్వరూపములు.

మధ్యదేవాలయమునకు ఎడమవైపున సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయమున్నది. ఈ గుడియొక్క స్తంభములు, కుడ్యములమైనున్న రాతినగిషీపని గొప్పశిల్పచాతుర్యమును చాటుచున్నది. దేవాలయకుడ్యముయొక్క ఒకభాగమునుండి ఒకతూము నిర్మింపబడినది. స్వామికి అభిషేకము చేసిన జలమంతయు యీ తూముగుండ బయటికివచ్చును. యాత్రికులు యీఅభిషేకజలము చాల పవిత్రమైనదిగాభావించి చేతులతోపట్టుకొని శిరమునజల్లుకొని తీర్థముగ పానముచేతురు.

తంజావూరుబస్తీ అంత అందమైనదిగాదు. పురాతనమైన పట్టణముగ కనబడును. పట్టణ మధ్యభాగమున



పండరీపురమున గోపాలపుర దేవాలయము



పండరీపుర దేవళ ప్రాంతమున చంద్రభాగ్ నదిలో
యాత్రికులు స్నానముచేయుట.



అర్చనకు

శివాజీమహారాజుగారి రాజనగరున్నది. ఇక్కడ శివాజి దర్బారుహాలు చూపరుల నాకర్షించుచుండును. ఇది చిత్రవిచిత్రములైన రంగులతో చిత్రింపబడి యున్నది. శివాజీమహారాజు కూర్చుండుసింహాసనము బ్రిటీషువారు తీసుకొనిపోయినట్లు చెప్పుదురు. ఈ దర్బారుహాలుకుముందు ఖాళీ స్థలమున్నది. దాని చుట్టును భవనములున్నవి. శివాజీ దర్బారు చేయు నప్పుడు రాజులు సామంతరాజులు కూర్చుండి కొలువు చేయునప్పుడు చుట్టునున్న ప్రాసాదములపైనుండి రాణులు చూచుచుండురట.

మహారాష్ట్రరాజులకు సంస్కృతవిద్యయం దమిత ప్రీతియని తెలుపుచున్న ఒక గొప్పపుస్తకభాండా గార మిచ్చటనున్నది. పురాతనగ్రంథపరిశోధకులు అనేకులు ఈలైబ్రరీకివచ్చి చదువుకొని వెళ్లు చుందురు.

కొన్నిచోట్ల చీకటికొట్లున్నవి. మరికొన్నిచోట్ల భూగర్భసొరంగ మార్గములున్నవి. శివాజీ కోర్టు హాలుగోడలపై మహారాష్ట్రరాజుల చిత్రపటము లున్న వారి ఆయుధములు పూర్వరాజులుధరించు కవచములు మున్నగుచిత్రములు రంగులతో చిత్రింప బడియున్నవి. తూర్పుగేటువద్ద పెద్ద ఫిరంగియున్నవి.

తంజావూరు రైలుస్టేషనుకుదగ్గఱగ జిల్లాబోర్డువారి సత్రమున్నది. ఇక్కడ దినమునకు 4 అణాలు క్రిందను మేడపైన గదులకు 8 అణాలు చార్జిచేయబడును. ఇక్కడ అన్నివసతులు గలవు.

కర్నాటక సంగీతమునకు తంజావూరు ప్రసిద్ధికెక్కి నది. దీనికి ఏడుమైళ్లు దూరమున కావేరీతీరముననున్న తిరువాదియందు ప్రతిసంవత్సరము త్యాగరాజ ఉత్స వములు జరుపబడును. అప్పుడు వివిధప్రాంతముల నుండి సంగీతవిద్వాంసులు సమావేశమగుచుందురు.

తంజావూరు మద్రాసుకు 220 మైళ్ల దూరమున నున్నది. రైలుచార్జి సుమారు 3-14-0 వుండును.

## కుంభకోణము

ఇది చాల పురాతనమైన పట్టణము. ఇది కావేరీ నదీ తీరమందున్నది. సనాతనబ్రాహ్మణులకు మూల స్థానము. చోళరాజుల ముఖ్యపట్టణములలో నిది యొకటి. కుంభకోణం విజ్ఞానసముపార్జనమునకు ప్రధానస్థానము. కావేరీజలపానమే యీ విజ్ఞానము నకు కారణము. ఇంగ్లండుకు ఆక్స్‌ఫర్డు ఎట్టిదో మన దేశమునకు కుంభకోణ మట్టిది. ఇక్కడ కాలేజీలలో విద్య నేర్చినవారు చాల తెలివిగలవారని ప్రతీతి. కుంభకోణములో 24 దేవాలయములున్నవి. వీనిలో శ్రీ సారంగపాణి దేవాలయము చాల పనితనము గలది.

ఇక్కడ మహామాఘకొలను ఒకటి గలదు. గంగాజలము 12 సంవత్సరముల కొకసారి యీ కొలనుకు ప్రవహించునని హిందువులు నమ్ముదురు. అందుకని కావేరి పుష్కరమునకు లక్షలకొలది ప్రజలు వచ్చి స్నానము చేతురు. ఈ చెఱువు 20 యకరముల వెడల్పు గలది. నలువైపుల రాతితో మెట్లు కట్టబడి నవి. దీనిచుట్టును 16 దేవాలయములున్నవి. కుంభ కోణం తంజావూరు జిల్లాలోనిది. మద్రాసుకు 196 మైళ్లు దూరములోనున్నది. రైలుచార్జి రు. 3-8-0 వుండును.

## చిదంబరం

ఇది చెన్నపట్టణమునకు 154 మైళ్లు దూరములో నున్నది. ఇదిచాల పురాతనమైన శివక్షేత్రము. ఇక్కడ నటరాజస్వామి దేవాలయము ప్రధానమైనది. అమ్మ వారుపేరు శివకామి. ఇక్కడ పంచలింగములలో నొకటియైన ఆకాశలింగము ప్రతిష్ఠింపబడియున్నది. మిగత నాల్గింటిలో కంజీవరంలో పృథ్వీలింగమున్ను, జంబుకేశ్వరములో అప్పులింగమున్ను, తిరువన్నా మలైలో తేజోలింగమున్ను, కాళహస్త్రిలో వాయు లింగమున్ను ప్రతిష్ఠించబడియున్నవి.

నటరాజదేవాలయముయొక్క మంటపముల స్తంభములు, కుడ్యములు ప్రాచీనశిల్పచాతుర్యమును చాటుచున్నవి. ఈ దేవాలయము పూర్వము హిరణ్యవర్ణచక్రవర్తిచే నిర్మింపబడినదట. ఈ రాజుగారు తెల్లనిమెర్గచే అనగా శ్వేతకుష్టుచే బాధపడువాడట. ఈరాజు ఇక్కడి కొలనులో స్నానముచేయుటచే ఆయనకున్న కుష్టువ్యాధి నయమైనది. అందుచే ఆయన యీ దేవాలయమును కట్టించినట్లు చెప్పుదురు. ఈ దేవాలయముచుట్టూ 30 అడుగుల ఎత్తుగల ప్రాకారమున్నది. నలువైపులను 122 అడుగుల ఎత్తుగల గాలిగోపురములు గలవు. ఇక్కడనున్న గణేశవిగ్రహము భారతదేశములోనున్న అన్నివిగ్రహములకన్న పెద్దదని చెప్పుదురు.

ఇక్కడనున్న కనకసభ, నృత్యసభ మున్నగు మంటపముల పనితనము ద్రవిడియన్ రాజుల శిల్పితనమును చాటుచున్నవి.

నటరాజస్వామికి జూనునెలలో తిరుమంజనం ఉత్సవమున్ను డిశంబరు నెలలో ఆరుద్రదర్శనం ఉత్సవమున్ను ప్రాముఖ్యమైనవి. ఇక్కడ కర్పూరహారతికి, అభిషేకమునకు, దర్శనమునకు కొంతరుసుము చెల్లించవలసియుండును. ఇవిగాక చిదంబరరహస్యమని మరియొకటి గలదు. దానిని దర్శించుటకు కొంత డబ్బు హెచ్చుగ నివ్వవలెను. అర్చకులు విగ్రహము గుండ ఏదో ఒక తెరుపును చూపుదురు. ఇదే చిదంబరరహస్యము. నటరాజస్వామికి ఆరుద్రదర్శనం ఉత్సవములో పదియవరోజున దర్శనం దినమని చెప్పుదురు. ఆనాడు స్వామి ఆయిరక్కాల్ మంటపములో తేంచేసియుండును. ఈమంటపము సహస్రస్తంభముల గలది. స్వామిని ఇక్కడ దర్శించినవారికి పునర్జన్మ లేదని చెప్పుదురు.

చిదంబరములో అన్నామలై విశ్వవిద్యాలయము వూరికి కొద్దిదూరములో నిర్మించబడినది. ఇక్కడనే విద్యార్థులకు బసలు, ప్రొఫెసర్లకు గృహములు, కాలేజీ బిల్డింగులు మున్నగు భవనములు చాల కట్టబడియున్నవి. ఇక్కడ వీథులుతీర్చి యిటునటు వృక్షములతో చక్కగ నిర్మింపబడియున్నవి. మధ్య మధ్య వివిధ వృక్షలతాదులతోను, పుష్పగుచ్ఛములతో నున్న పార్కులు చూడ కన్నులపండువుగానుండును. దీనినే అన్నామలైనగర్ అని పిలుచుచున్నారు. ఇది యొక పట్టణముగ కనబడును. ఇక్కడ ఆర్టుకాలేజీగాక, సంగీతకళాశాల, సంస్కృత, తమిళ కాలేజీ, ఓరియంటల్ ట్రెయినింగు కాలేజీ మున్నగునవిగలవు. చిదంబరక్షేత్రమును దర్శించినవారు యీ అన్నామలై యూనివర్శిటీని చూడకుండరారని నమ్ముచున్నాను.

నేను చిదంబరంనుంచి చెంగల్‌పట్టు వచ్చితిని. దీనికి 7 మైళ్లు దూరములో తిరుకలుకుండ్రం అను పుణ్యక్షేత్రము గలదు. దీనినే పక్షితీర్థం అనికూడ పిలుతురు.

### తిరుకలుకుండ్రం—పక్షితీర్థం

ఇక్కడ కొండమీద దేవాలయము గలదు. ఆలయ రాతిగోడలమీద చెక్కబడిన శిలాశాసనములనుబట్టి ఇది రెండువేల సంవత్సరములనుంచి వున్నదని తెలియుచున్నది. ఈ గుడివున్న భాగము కైలాసపర్వతముయొక్క శిఖరము ఈశ్వరునివల్ల కైలాసపర్వత శిఖరములనుండి దక్షిణహిందూదేశమునకు మార్చబడినట్లు చెప్పుదురు.

రెండు పక్షులు ప్రతిదినము పగలు 11 గంటలకు యీ పర్వతశిఖరమునకు వచ్చి అర్చకుడు నివేదించిన ప్రసాదమును దిని పోవుచుండును. ఈ పక్షులు రెంటిలో నొకటి కాశినుండియు మరొకటి రామేశ్వరమునుండియు వచ్చునని చెప్పుదురు. ఈ రెండు పక్షులు పూర్వము యిద్దరు ఋషులనియు దేవుని శాపమువల్ల వారిట్టి పక్షిరూపమును దాల్చిరనియు చెప్పుదురు. పురాణగాథలనుబట్టి చూడగ యీ పక్షులు కొన్ని సంవత్సరములనుండిగూడ వచ్చుచున్నవని తెలియును.

## మహాబలిపురం

ఇది చెంగల్పట్టుకు 18 మైళ్ల దూరములో నున్నది. చక్కని మోటారురోడ్డు గలదు. దీనిని సెవన్ పెగోడాస్ అనికూడ పిలుతురు. ఇది పల్లవ రాజుల కాలమునాటిది. ఇక్కడనున్న కొండగుహాలు రెండువేల సంవత్సరములనాటివని చెప్పుదురు. ఈ గుహాలు ఒకేకొండలో తొలచబడియున్నవి. సముద్ర తీరమున రెండు ఆలయములున్ను వాటికి కొంతదూరమున పాండవరథములను పేరుతో అయిదు ఆలయములను గలవు. కొండప్రక్కనె అర్జునుడు తపస్సు చేసిన కొండప్రదేశము గలదు. ఇక్కడ కొండ గుహాలలో రాతి స్తంభములతో చెక్కబడిన మంటపము గలదు. ఈ రాతి స్తంభములపైన పురాణ గాథలుగల బొమ్మలు చిత్రింపబడిన విగ్రహములు ద్రవిడరాజుల కాలములో శిలాశిల్పము ఎట్టి ఉత్కృష్ట స్థానములోనున్నదో తెలుపగలవు. శివధనుస్సుకొరకు అర్జునుడు ఇక్కడనే తపస్సు చేసినట్లు చెప్పుదురు. ఇక్కడనున్న అయిదు రథములున్ను పంచపాండవుల జ్ఞాపకార్థము కట్టబడినట్లు చెప్పుదురు. ఒకేరాతితో చెక్కబడిన సింహాకరాశ సింహాసనము గొప్పవృషభము రత్నము ఏనుగ గలవు.

సముద్రమువద్దనున్న ఆలయములో 16 పలకలుగా నీలిరంగు శిలాలింగము దాని కెదురుగ సముద్రజలము తాకుచోటున ధ్వజ స్తంభము గలదు. ఇక్కడిగుహాలు, విగ్రహములు భరతఖండములో మిక్కిలి ప్రసిద్ధిగాంచినవి.

మహాబలిపురమునుండి బస్సుమీద తిరిగి చెంగల్పట్టు వచ్చి యిక్కడినుంచి కాంచీపురము వెళ్లితిని.

## కంచి

కంచి మద్రాసుకు 45 మైళ్ల దూరములోనున్నది. ఇది చెంగల్పట్టు-ఆర్కోణం బ్రాంచిలైనుమీద నున్నది. భరతఖండములోని సప్తపుణ్యక్షేత్రములలో కంచిపుర మొకటి. కంచికామాక్షి, కాశివిశాలాక్షి, మధురమీనాక్షి అమ్మవార్లను దర్శించని జన్మ మేల యని చెప్పుదురు.

కంచి శివ విష్ణు దేవుల ఇద్దరియొక్క పుణ్యస్థలమై యున్నది. అందుకనే శివకంచి యని విష్ణుకంచి యని రెండుగ కంచీపురము విభజింపబడియున్నది. శివుని పేరు ఏకాంబరేశ్వరుడు. ఆయన భార్య కామాక్షి. విష్ణుకంచిలో వరదరాజస్వామి యుండును. మే మాసములో వరదరాజస్వామికి గరుడోత్సవము జరుగును. ఈ ఉత్సవమును చూచుటకు వేనవేలు వివిధ ప్రాంతములనుండి వత్తురు. ఆలయములో వెండి, పసిడిబల్లులు రెండున్నవి. ఇవి తాకిన బల్లిపాటు దోషములేదని చెప్పుదురు. వీనిని తాకినవారేగాక తాకివచ్చినవారిని తాకినవారికిగూడ దోషముపోవునని ప్రతీతి. రాతిపై చెక్కపడిన యీ బల్లులను తాకుటకు ఒకఅణా యివ్వవలెను. ఆ గ్రణా యిచ్చినవారు గుడ్డతోవిసరి తాకవచ్చునట. ఈభాగముచుట్టూ కటకటాలు కట్టబడియుండును. ఇక్కడ ఆమేసా ఒక మనిషి కావలియుండును.

విష్ణుకంచినుండి శివకంచికి 2 మైళ్లు. ఇది విశాలమైన ఒకేవీధిగనుండును. ఇక్కడ యిత్తడి కంచు పాత్రల వ్యాపారము విశేషముగనుండును.

కంచిలోని దేవాలయములన్నిటిలో ఏకాంబరేశ్వర దేవాలయము చాల పెద్దది. జనవరి, ఫిబ్రవరి, మే మాసములందు యిక్కడ గొప్ప ఉత్సవములు జరుగును. సహస్ర స్తంభ మండపము గోపురములు, కోనేరులు చూడదగియున్నవి. వీనిలో పెద్దగోపురము పది అంతస్థులుగలిగి 188 అడుగుల ఎత్తు గలిగి యున్నది.

కాంచీపురమును దక్షిణకాశి అని పిలుతురు.

కాంచీపురముతో నాదక్షిణదేశయాత్ర ముగిసినది. నేను కంచినుండి చెంగల్పట్టుమీదుగ చెన్నపురి చేరితిని.

# గృహపరిశ్రమ

"గృహపరిశ్రమ" యనిన నాయూహ గృహమునకు వలయు వస్తుసముదాయము నాయా గృహిణులు లోనగూర్చుకొనుటయే గృహపరిశ్రమయనియు, దానికుటుంబమున కయ్యెడి కర్చులో కొంత నిలువయగుననియు, స్త్రీలు గృహమునకు వలయు వానికంటె నధికముగ పరిశ్రమచేయజాలరనియు, నందుపై కొంద రతిశయముగ నొనగూర్చి యితరులకు విక్రయించి లాభమునుబొందుట కలదనియు నూలు, పట్టు, వున్ని, తలనూనెలు, దంతచూర్ణము, కుంకుమ, కట్టుపనులు విస్తళ్లు కుట్టుట, చారపప్పును దయారుచేయుట కూరలు, పుష్పలతలను పెంచుటయు నాహారాదిమసాలావస్తువుల నొనగూర్చుటయు నిట్టిపనులన్నియు గృహపరిశ్రమలే యగునని కొందఱార్యులు వచింప నేను వినియున్నాను. గృహపరిశ్రమలచే ధనము నార్జింపవలయునన్న నాపరిశ్రమలలో నధికమనియు, నల్పమనియు భేదములు చూడరాదు. గృహపరిశ్రమలవలన నల్పధనము నార్జింపనగునే కాని యధికధనము నార్జింపవలనుపడదు. గృహపరిశ్రమలన్నియు నల్పములుగనే యుండును. అన్ని పరిశ్రమలలో రాట్నపరిశ్రమయే మిన్నయని నాయభిప్రాయమే కాక కొందఱార్యుల యభిప్రాయమును ననుభవైకవేద్యమును నైయున్నది. రాట్నము గృహిణుల కర్మకలాపములో జేర్పవలసిన ముఖ్యాంశమయ్యు గృహలక్ష్మి యుద్దేశ్యముల నెరవేర్పజాలదనుటలో కొంత శోచనీయము. హిందూదేశమునందలి ప్రాచీన గృహపరిశ్రమలలో రాట్నము ప్రధానపరిశ్రమయని నొక్కివక్కాణింప వీలుకలదు. గృహలక్ష్మి యుద్దేశ్యములన్నియు రాట్నపరిశ్రమకే వర్తించుచున్నవి. అది యెట్టులని ప్రశ్నింతురు కాబోలు. గృహిణు లిల్లువీడకయే పరిశ్రమచేయవలయుననుట ప్రథమము. గృహమునందుండియే నూలువడుకవచ్చును. ఇతరుల సహాయముతో బనిలేదు. కదురుకు జుట్టియుండు చిన్నదారమునకు నేకును నంటించి బారతీయుచున్న మహిళా సోదరికింకొకరి సహాయమేల? నూలువడుకుటకు విదేశవస్తు సాధనములతో బనిలేదు. ఈవస్తువు విదేశవస్తుస్థానమాక్రమించుననుటకు సందియము లేదు. కాని పరిశ్రమాభివృద్ధి కాకుండిన నాస్థానమాక్రమింపజాలదు. ఏపరిశ్రమయైనను జేసిన నెరవేరును చేయకున్న నేదియు నెరవేరుటలేదు. "వుద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మి" ప్రయత్నించినచో లక్ష్మి పొందును. రాట్నపరిశ్రమ కుపయోగించు వస్తువున కెంతో కృషి చేయవలసిన పని లేదు. అన్ని వస్తువులును మనముండెడి పల్లెలలోను బట్టణములలోను సులభముగ లభించును. రాట్నపరిశ్రమ యితరుల

జీవనముల కడ్డుపడునదికాదు. ఇదియొకవృత్తిగా నెవ్వరును బరిగణించుటలేదు. విరామకాలమునఁ బ్రతిగృహిణులును దమయింట నూలువడుకుకొనుట సహజము. నేతనేయుట, పడుగులుచేయుట, మొదలగునవి సాలెవారి వృత్తులు; అట్టిపనులొనర్చిన సాలెవారివృత్తి కడ్డుపడును. కాని నూలువడుకుట గృహపరిశ్రమ యగుటచే నేయొక్కరి నిజవృత్తికిని యడ్డుపడునదికాదు. ఈ పరిశ్రమ సగ్రవర్ణములాది సర్వజనులును జేయందగును. ప్రాచీనపరిశ్రమలలో శ్రేష్ఠమైనదియు,సులభసాధ్యమైనదియు, రాట్నపరిశ్రమయని మహాత్మగాంధిగారు బాగుగనెఱింగి పరిశ్రమఁ జేయుండని ప్రబోధించెను. గృహపరిశ్రమల వలనఁగూడు లాభమెంతయైనను సంతసింపవలసినదే! ధన, మానములను గాపాడునది రాట్నపరిశ్రమకాక యితరపరిశ్రమ లేవియు కాజాలవు. మానవుల కన్న వస్త్రములే ప్రధానములు. అన్నములేకున్న నరగంటయైనను నుండవచ్చును. తిరుగవచ్చును. వస్త్రములేకున్న నరనిముషమైనఁ దిరుగఁజాలరు. కావున వస్త్రపరిశ్రమకు నూలు మూలాధారము. అట్టినూలు వడుకుటకు నభ్యాసమొనర్చుటయే మన ముఖ్యకర్తవ్యము. వస్త్రములకై విదేశముల కెంత ధనమును బంపుచున్నారమో యందఱెఱుంగుదురు. వడుకునూలు కర్చువిషయమును గుఱించి యోచించిన, బీదలు, భాగ్యవంతులును మానవులైన ప్రతియొక్కరును గాంక్షించువస్తువై యున్నది. (హిందూదేశమున) అట్టివస్తువు కర్చుకాక నిలువ యుండునా? ఈ వస్తుపరిశ్రమ మిగుల తక్కువయై యుండుటచే వడుకెడునూలు లభింపకయున్నది. కావలసిన ముఖ్యవస్తువు విరివిగలేనపు డెంత గిరాకియగునో పరిశీలింపుడు. గిరాకివస్తువువలన లాభము చేకూరును. దేశవస్తువును ప్రేమించువారనేకు లేర్పడియున్నారు, దాన నూలుకర్చు విరివిగ యగును. కర్చునుగుఱించి సందేహమొదవఁ బనిలేదు. ఖాదీవస్త్రాలయములెన్నియో స్థాపించియున్నారు. వారి కెఱింగించిన నెంతనూలునైనను విలుతురు. కర్చును గుఱించి విశేషము వ్రాయఁ బనిలేదు. వారివారి నేర్పుకొలఁది కర్చుపడుచుండును. పరిశ్రమఁచేయక పలుకరాదు. "కష్టేఫలీ" యని ప్రమాణము. కష్టమొనర్చిన ఫలిత మున్నది.

గీ. తనిసిరే వేల్పు లుదధిరత్నములచేత
వెఱచిరే ఘోరకాకోల విషముచేత
విడచిరే యత్న మమృతంబు బొడముదనుక
నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు.

నేర్పరులు వారూనినకార్యమును నెరవేర్చువరకు వదలుటలేదు. సోదరీమణులారా? గృహిణులు గృహముల నేరీతి నుద్ధరించుటకర్హులో దేశమునందు ప్రాచీన గృహపరిశ్రమలను నటులే నుద్ధరింప నర్హులై యున్నారు. "స్త్రీణాం................ సాహసం షడ్గుణంచైవ" సాహసమునందు స్త్రీలు పురుషులకంటె నారురెట్లధికులుగ నున్నారు, ధైర్యసాహసములచే నీపరిశ్రమను

సాగించి లాభమును, యశమును బొంద వలయును. ఇది యెట్టులది యెట్టులనుటలో గాలమును వ్యర్థముసేయుచు పరిశ్రమనాపి వేసిన నెప్పటికెంతయొగలియగును. ముమ్మారు పలుకుచున్నాను. రాట్నపరిశ్రమ ధన మును, యశమును గడియించఁ గలుగును. గృహపరిశ్రమలనుగుఱించి అయిదారుమాస ములుగఁ బ్రకటించినను వానినిగుఱించి వ్రాయకుండు టేలకో యని ప్రశ్నించు చున్నారు. ప్రకృతపు పరిస్థితులలో గృహ పరిశ్రమలన్న నేమిటోయని తలంచు చున్నారు. యంధకారమందున్నవారు మార్గ దర్శకులగుదురా? ఏపరిశ్రమనుగుఱించి వ్రాయుటకును ననుభవము లేకయున్నది. ఇక్కాలంబున స్త్రీపురుషు లుద్యోగమును గోరుటతప్ప స్వతంత్రాభివృద్ధియగు పరి శ్రమల నెంతమాత్రము కోరుట లేదు. దాస్యశృంఖలాబద్ధులై యున్నవారు.

రాట్నపరిశ్రమకు వలయు యంత్రసామ గ్రులన్నియుఁ దయారుచేయుట కాయా గ్రామములయందును, బట్టణములయందును, వడ్లకరమల పనివాండ్రు కలరు. వారివలన వలయు సాధనములన్నియుఁ బడయవచ్చును. లేక తయారు చేయించవచ్చును. అన్ని సాధ నములును గొయ్యతో దయారు చేయ నగును. కదురుమాత్ర ముక్కుతో దయారు చేయుదురు. యంత్రములీ క్రిందిమేర కుండ వలయును.

| | | | |
|---|---|---|---|
| 1. రాట్నము | క్రయము | 1-0-0 | |
| 2. కదురు | ,, | 0-0-3 | |
| 3. కండెలుపోయు కండెకదురు | ,, | 0-0-6 | సూదుల మ్మెడు షాపులలో దొరకును. |
| 4. అనుబాన నూలుపడుగులు గాఁ దయారు చేయుటకు | ,, | 0-8-0 | |
| 5. ప్రత్తిగింజతీయు యంత్రము (ప్రత్తి రాట్నమందురు.) | ,, | 1-0-0 | |

1 మొదలు 4 వరకుగల సాధనములు సాలెవారియిండ్లలో నుండును. వారినడిగిన విశదమగును. రాట్నపరిశ్రమ చేయవలయు నన్న నీపరిశ్రమ నెఱింగి సమీపముననుండు వారలవలన మెల్లమెల్లగఁ గొంతకాల మభ్య సించిన నూలువడకుట సాధ్యమైయుండును. ప్రత్తిని తయారుచేయువిధమును వివరించు చున్నాను. పైనుదహరించిన నెం 5 రు సాధ నముచేత స్త్రీలే తమగృహములయందు ప్రత్తిని గింజతీయుదురు. అటు గింజతీసిన ప్రత్తిని దూదేకువానికొసంగిన వీశ 1_కి 0_2_0 ప్రకారం కూలి నిపుచ్చుకొని యేకులుగాఁ దయారుచేసియిచ్చును. ఆ యేకులచే నూలువడుక నారంభించవలెను. వేయేల? ఈయొక్కపరిశ్రమఁజేసిన ధన మును గడించవచ్చును. ఇందు లాభమును గ్రహింపుడు – ఒకకుటుంబమునకు మనము కొనుచున్న గుడ్డలఖరీదు కుటుంబమనగా (భార్యయు భర్తయు) వీ రిరువురిగుడ్డలకు మాత్రము 1 సంవత్సరమునకు 28_0_0

నూలువడుకుకొని గుడ్డలు నేయించు కొనుటవలన నయ్యెడిది 12-0-0

గుడ్డలు కొనుటవలన గలిగెడు నష్టము యొక్క మొత్తము 16-0-0

ఒకకుటుంబమునకు బట్టలకు మాత్ర మింతనష్టము కూడుచున్నది.

లాభమెట్టులనిన:—

ఒకకుటుంబమునకు వడుకు నూలుగుడ్డ యేబదిగజములు సాలునకుఁ జాలును.

50 గజములకు వలయుప్రత్తి 3 మణుగులు.

ఎక్కువఖరీదు 6-0-0

ప్రత్తియందలి గింజతీయుటకు కూలి లేదు. ఏలనన మనమే తీయవచ్చును. లేక ప్రత్తిగింజలఖరీదుతో నాకూలి సరిపోవును.

ఏకులకూలి—5 వీశెలకు 0-10-0

వడుకుకూలి-మనమే వడుకుచున్నా ముగనుక కూలిలేదు. కూలియిచ్చిన 5 వీశె లకు నె 12 నూలుతో సమానముగ వడికిన నూలుకు 5-0-0

నేతకూలి—5 వీశలనూలుకు చేరి 5-0-0

పడుగుపోయుకూలి— ,, 0-6-0

వొట్టుమొత్తం 17-0-0

పైమొత్తములో వడకుట మనమే యైనందున వడుకుకూలిక్రింద కమ్మీ చేయవలసినది. 5-0-0

50 గజములగుడ్డకు నికరంఖర్చు 12-0-0

ఈప్రకారము పరిశ్రమచేసి పురుషులకు లాభమును గలుగఁజేసిన మేలుగదా? పురుషుఁడొక్కడె కుటుంబమునంతయు బోషింప వలెనన్న నెంత ప్రయాసగనుండునో కష్టము లెఱింగిన కాంతామణు లెఱుంగుదురు. గృహపరిశ్రమలు చేయుటవలన స్త్రీలును గొంతధనము నార్జించువా రగుచున్నారు. ఇటుగాక ధనము నార్జింపఁబూనిన, ప్రత్తిని సైత మింటియందే పైరుచేసి పైవిధము ననేకులు తయారుచేసి నూలువడికినచో ప్రత్తిఖరీదును వడుకుకూలి నార్జింపనగును.

అనుమకొండ రాధమ్మ.

# పెండ్లి సంబంధాలు

మావూళ్లో ఒకాయన మూడురోజులు కటికి ఉపవాసాలుచేస్తూ వీధిఅరుగుమీద కొల్లాయిగుడ్డ పరచుకొని పడుకున్నాడు కూతురికి తాను కుదిర్చిన సంబంధాన్ని తనభార్య ఒప్పుకోలేదని. నాలుగవరోజున ఎల్లాగైతేనేమి రాజీపడ్డారనుకోండి. ఏమైనా యీ పెళ్లి సంబంధాలవిషయాల్లో కొంతమంది పడే అవస్థలు చూస్తూవుంటే చాలా ఆశ్చర్యము వేస్తుంది. మా బంధువుడే ఒకాయన తనకూతురికి పదవ సంవత్సరము రాగానే ప్రారంభించాడు అల్లుణ్ణి వెతకడానికి. ఆయన కాస్త డబ్బున్నవాడే. ఒక సంవత్సరంపాటు స్కూలుకి శలవుపెట్టి పక్కరలేకుండా శనివారాదివారాలు రావడం తరువాయిగా బయలుదేరేవాడు మూట చంకనివేసుకొని. ఈవూరు ఆవూరు విసుగు విరామములేకుండా తిరిగి చాలాచోట్ల వాకబులు చేశాడు. ఆస్తివుంటే చదువులేదనీ, చదువుంటే ఆస్తి లేదనీ, రెండూవుంటే పిల్లవాణ్ణిచూస్తే భయమువేసేటట్టు ఉన్నాడనీ, అన్నీ బాగావుంటే తాహతకు మించిన కట్నము అడుగుతున్నారనీ, పోనీ ఒకతే కూతురు గదా, అప్పోసప్పోచేసి కట్నం ఇద్దామని అనుకుంటే అత్తగారు గయ్యాళిఅనీ తుదకు ఒక్క సంబంధమైనా కుదరలేదు ఆయనకు. విసిగిపోయి మా అమ్మాయికి సంబంధము దొరక్కపోతుందా చూద్దామని ఊరుకున్నాడు రెండేండ్లు. ఇవేమనా కూరగాయలు కనుకనా వచ్చి కొనుక్కునిపోవడానికి? ఊరుకుంటే అల్లాగే ఊరుకోవడమైందిగాని ఏ సంబంధమూ ఆయనవద్దకు రాలేదు. ఇక ఇది పనిగాదని ఉద్యోగానికి కొన్నాళ్లు సెలవుపెట్టి కాలేజీలన్నీ తనిఖీచేయడం మొదలుపెట్టాడు. స్కూలుఫైనలు ప్యాసయి ఇంటరుమీడియేటు క్లాసులో చేరతారు గదా అనేక ఊళ్లనుంచి కుర్రవాళ్లు, వాళ్లలో ఏరుకోవచ్చునని ఆయన ఊహ. డబ్బులేకపోయినా, ప్రస్తుత మీ విద్యావిధానము స్వతంత్రజీవనాని కేమీ సహాయపడడంలేదని తెలిసీకూడా డబ్బిచ్చి చదువు చెప్పించే మామగా రెవరైనా దొరక్కపోతాడా అని కొంతమంది వాళ్ల పిల్లలను స్కూలుఫైనలు అవడంతోటే కాలేజీలకు తోలుతూఉంటారు. ప్రతిరోజూ ఆయన సాయంత్రము నాలుగయేటప్పటికి కాలేజీకి హాజరయి క్లాసుల్లోంచి వచ్చే విద్యార్థులను పరకాయించిచూచి కొంతమంది ఎడ్రసులుకూడా వ్రాసుకొనిపోయేవాడు. అప్పటికీ ఈయనకు తృప్తి అయినది దొరకలేదు. ఈవిధంగా రెండు మూడేళ్లు తిరగ్గా తిరగ్గా ఏదో ఒకసంబంధం దొరకింది. అప్పటికి అమ్మాయికి పదిహేనేళ్లు వచ్చాయి. ఈ వరాన్వేషణానికి అయిదేళ్లు తిరగడానికి ఆయనకు ఎంత డబ్బు ఖర్చుఅయినదో లెక్కలేదు. ఇన్నాళ్లా ఈ సంబంధాల కబుర్లు చెపుతూవుంటే వినేవాళ్లకు చెవులు చిల్లులుపడిపోయేవి. చెప్పొచ్చేదేమిటంటే ఈయన తిరగడానికి ఖర్చుపెట్టిన సొమ్మును ఇంకేమైనా కలిపి ఒక బీదవానికిచ్చి వానికి తన కూతురునిచ్చి పెళ్లిచేస్తే బాగుపడేవాడనుకునేవాణ్ణి.

మొన్న మొన్నటిదాకా పెండ్లిసంబంధాలకోసము పెద్దవాళ్లు నానాపాట్లుపడి మంచి సాంప్రదాయాలవాళ్లను, గౌరవకుటుంబాలలోనివాళ్లను, సమాన తాహతగలవాళ్లను, రూపవంతులను వెదకి పెండ్లిచేసేవారు. తాహతకుమించిన సంబంధాలవుతే చాల చిక్కులున్నాయి. అప్పుచేసి కట్నము ఎక్కువ ఇవ్వడము సరేగదా పరస్పర గౌరవాదులలో తేడాలు జరుగుతూవుండడమూ, దానిమీద కష్టలు బయలుదేరడమూ జరుగుతూంటాయి. ఇక జమీందారీ కుటుంబాలలో సాధ్యమైనంతవరకు జమీందారీ సంబంధాలనే చూచుకుంటారు కనుక డబ్బువిషయాలలోను, గౌరవాలలోను లోపముండదు. చిక్క-

ఎక్కడయ్యా అంటే జమీందారీపిల్లలకు జమీందారీ కుటుంబాలలో వరులు దొరకనప్పుడు. అటువంటి సందర్భాలలో సామాన్యసంసారులలో కాస్త మెరుగైనవాడికి బాగాడబ్బిచ్చి పిల్లనిచ్చి పెళ్లిచేస్తారు. ఎంత డబ్బుయిచ్చినా అటువంటివాడి జీవితం ఎంత వినోదంగా ఉంటుందో వ్రాయాలంటే ఒక పెద్ద గ్రంథమవుతుంది. అందుచేత ఆసంగతి వదలివేద్దాము.

పూర్వపురోజులలో వివాహ విషయాలలో పెత్తనంఅంతా ఇంచుమించుగా తల్లిదండ్రులమీదనే ఉండేది. వాళ్లు నిశ్చయించిన సంబంధాలకు వాళ్ల పిల్లలు మారుచెప్పేవాళ్లు కారు. ఎవళ్ల పిల్లలకు వాళ్లు అన్ని మంచిచెడ్డలూ ఆలోచించి మంచిసంబంధాలనే కుదురుస్తారుగాని చెడ్డవాటిని ఎన్నటికీన్నీ నిశ్చయించరు. రానురాను స్త్రీ పురుషులు హూణవిద్య అభ్యసించినప్పటినుండీ వివాహతత్వాలుకూడా మారిపోయాయి. తల్లిదండ్రు లీ సందర్భాలలో మాట్లాడేటందుకే లేకుండా ఉంది. పెద్దవాళ్ల సలహాలేకుండా స్వతంత్రించి తమ ఇచ్చవచ్చినట్లు సెలెక్టుచేసుకొని పప్పులో అడుగువేసినవాళ్లను అనేకమందిని చూస్తూ ఉన్నాము. పెండ్లిచేసుకునేవాళ్లు వేరేఉండగా పెద్దవాళ్లు నిశ్చయించడమేమిటి, వీళ్ల రుచులు, వాళ్ల రుచులు వేర్వేరుగా ఉండవచ్చును, వధూవరులు ఒకరినొకరు పెండ్లిచేసుకునేటందుకు ఇష్టపడితేనే గాని ఆ దాంపత్యము అన్యోన్యంగా ఉండదు కాబట్టి ఈ విషయాలలో ఇతరులు కలుగజేసుకోకూడదని అనేక మంది అభిప్రాయం. ఆమాట నిజమే. కాదని ఎవరును అనుటకు వీలూలేదు. కాని పెద్దవాళ్లు లోకానుభవము ఎక్కువగలవారనిన్నీ, వారివారి కుటుంబ పరిస్థితులు, మంచి చెడ్డలు ఎక్కువగా తెలిసికోగల రనిన్నీ, వాళ్లకుకూడా కొంతతావు ఇవ్వడము మంచిది.

ఒకరినొకరు కొంతకాలము ప్రేమించుకొని తర్వాత వివాహము చేసుకోవాలిగాని అతాత్తుగా కొత్తవాళ్లను కట్టబెడితే ఆదాంపత్యం అంత అన్యోన్యంగా ఉండదని మరికొంతమంది 'రీసెర్చి' చేశారు. అట్లు ప్రేమించుకొనుటకున్నూ, పెండ్లికిముందే కొంతకాలము ఇద్దరూ పరిచయముగా ఉండుటకున్నూ, మనకు సాధ్యముకాదు. అదియునుగాక మనసంఘం ఒప్పుకోదు. ఏవిధాన్నైనా వారిరువురు కొంతకాలం పరస్పరము ప్రేమించుకొని వివాహము చేసుకొనుటకు నిశ్చయించుకొన్నపుడు అట్టి వివాహాలకు అడ్డుపెట్టకూడదు. అడ్డంకులు కలుగజేస్తే జరిగేడికథలు మనము వింటూనేయున్నాము.

పాశ్చాత్యవిద్యకాస్త అభ్యసించిన మాత్రాన పాశ్చాత్యదేశాచారాలనే అవలంబించాలనే మనవాళ్ల ఉద్దేశ్యం. ఒకపెద్దమనిషి తిరిగితిరిగి ఘోర్తుఘోరము చదువుతూవుండే తన కుమార్తెకు సంబంధంఒకటి కుదిర్చాడు. తనకూతురు ఇంగ్లీషువిద్య చదువుతూ ఉండిగదా బాగా ఇంగ్లీషు చదివినవరుడు ఉంటేనే గాని బాగుండదని ఒక బి.యే.ను తీసుకువచ్చాడు. అన్నిలక్షణాలు బాగానేఉన్నాయి, ఆస్తికూడా ఉన్నదని నిశ్చయముచేసుకొని ఇక తాంబూలాలు పుచ్చుకునేముందు వధూవరులు ఒకరినొకరు చూచుకొందుకుగాను వరుణ్ణి ఒకమంచిరోజున తనయింటికి రప్పించాడు. వారిరువురనూకూడా నేను ఎరిగి ఉండటంవల్ల నేనుకూడా ఆసమయాన్ని వాళ్లింటివద్ద మకాంచేయడం తటస్థించింది. పెళ్లికూతురును ముస్తాబు చేశారు. పిల్లకు వచ్చినవిద్య ఫిడేలుమీద నాలుగు త్యాగయ్యగారి కీర్తనలు పాడించారు. ఎంతోచక్కగా వాయించేది. ఇప్పుడెందుచేతనో ఇన్ని అపస్వరాలు, తప్పుతాళాలతోటి ఉందిఅని నేననుకొని ఆమెముఖం కేసిచూశాను. వికారంవచ్చినదానిముఖంలాగ పెట్టింది. వరుడు తృప్తిపడినట్లే కనబడ్డాడు. ఈ మేజువాణీ అయిపోయిన తర్వాత ఎవరంతట వాళ్లువెళ్లి పోయారు. తరువాత నేనువెళ్లి అమ్మాయిని పెళ్లికొడుకునచ్చాడా? అని అడిగాను. "ఛీ. అదేమి పెళ్లికొడుకు పిలకా ఆయనాను? నేను చేసుకోను" అన్నది. ఆమెతల్లి

తండ్రి అనేకవిధాల నచ్చచెప్పారు. మిగతా అన్ని లక్షణాలు బాగానే ఉన్నా గానీ కేవలం ఈపిలక జుట్టు, ముందరవసారాకోసం ఒప్పుకోన్నదిగాదు. పెండ్లిఅయిన తక్షణం పిలకకత్తిరించేద్దువుగాని ఈ లోపున అంత ప్రమాదమేమున్నదని నేను సలహాకూడా యిచ్చాను. 'ఆఁ! కత్తిరించడమేమిటి, సహజంగా ఆ అలవాట్లు పుట్టాలిగాని" అంది. తుదకు ఆ సంబంధం అవలేదని విన్నాను. ఈమెకు ఫోర్తుఫారంలోనే పాశ్చాత్యాగ్రహం ఆవహించిందా అనుకున్నాను.

అవకడి సమాచారంకూడా కొంచము తమాషాగానే ఉంది. ఆతడు ఇదివరకే స్కూలుఫైనలు చదువుతూవున్న వధువుని చూడడానికివెళ్లి తర్వాత ఆలోచించి చెపుతానని తిరిగివచ్చాడట. ఆపెళ్లికుమార్తె వేసిన 'డ్రస్సు' హెస్తరుచూస్తే ఇంకముందు చీరలు కట్టడము మానివేసి దొరసానులవలె గౌనులే తొడిగేటట్టువుందనీ, తాను సంపాదించేదంతా ఆమె విలాసవస్తుసముదాయానికే కడలేరుకుందనీ ఆ సంబంధము మానివేశాడట. కాబట్టి కొందరు వధూవరులను సెలెక్టుచేసుకోమనేటప్పటికి వాళ్ల దూరదృష్టి ఇంతమాత్రంలోనే ఉంటుంది.

ఇక పాశ్చాత్యనాగరకాగ్రగణ్యుల విషయము కొంచెము ఆలోచిద్దాము. మనపద్ధతులు, మన ఆచారాలు పాతబడిపోయాయి. వారివారి కోరికలను తెలియపరుస్తూ అందులకు సరిపోయేవారు ఫలానావారికి ఫోటోల సహితంగా దరఖాస్తులు పంపుకోవలసిందని వార్తాపత్రికలలో ఎడ్వర్టైజు చేసుకుంటూఉంటారు. పత్రికలు చూచేవారికి అనేక తమాషాలు కనిపిస్తూఉంటాయి. మాటవరసకు ఒకటి రెండు చూద్దాము.

"A person........desires to marry an educated lady, virgin or widow of any caste or religion. The lady should be able to realize that what matters in life is a person's social worth and not his caste or religion which are largerly determined by accidents of birth."

ఆయనతత్వము ఈవిధంగాఉంది గనుక దాని కనుగుణ్యంగా ఉండేవాళ్లు అరుదుగదాఅని ఈవిధంగా ఎడ్వర్టైజు చేశాడనుకుందాము.

అయితే ఈ క్రిందివిషయానికేమంటారు?

"A girl of 18 wants a bridegroom.........only those having a sole eye for conjugal happiness need correspond to ..."

ఇక ముందుముందు వివాహాలు ఎట్లాఉంటాయంటే ఇంకా తమ హృదయకమలాలలో పుట్టే నూతన ఉద్దేశాలన్నీ ఎడ్వర్టైజు చేసుకుంటూ, ఇష్టమైనవారు సర్వీసు కమీషనువారు ఉద్యోగాలకోసము రమ్మన్నట్లు, ఫలానావూరు ఫలానావారోజున ఇన్నిగంటల ఇన్నినిమిషాలకు హాజరుకావలసిందనే స్థితిలోకివస్తాయనిన్నీ, సెలక్షనుకూడా సర్వీసెసు కమీషనువారి మాదిరిగనే ఉంటుందనిన్నీ అనుకోవడానికి సందేహింప బనిలేదు.

సత్యవోలు శ్రీరామమూర్తి.

# బిడ్డ ఎపుడూ ఏడుస్తుంటే తప్పేమై వుంటుంది?




## బలహీనమై అల్లరిచేస్తూవుండేబిడ్డకు వైద్యులు సిఫార్సుచేసిన ఈచికిత్స అవసరం.

ఆహారంలో ముఖ్యమైనవస్తువులు లేనిదానివల్లనే చాలమంది పిల్లలు అల్లరిచేస్తూ సంతోషహీనంగా వుంటారు. వారికి ఆరోగ్యం, బలం, సంతోషమూ కలిగించాలంటే తగునైనవానిని యివ్వడమే ఉత్తమమార్గం.

అరవైయేళ్లుగా పిల్లలకు బలవర్ధకౌషధంగా పేరుపొందివుండే స్కాట్సు ఎమల్షన్ కంటె ఈవిషయాల్లో పనికొచ్చే వేరే యితరపాటిని వైద్యులు కనిపెట్టలేకపోయారు. దీనిలో శుద్ధమైన కాడ్ లివరాయిల్ మాత్రమే కాకుండా, పిల్లల ఆరోగ్యానికి, వృద్ధికి ముఖ్యంగా కావలసి కాల్సియమ్, భాస్వరమూ, ఎ.డి. జీవధాతువులుకూడా వుంటవి. ప్రత్యేకమైన పద్ధతితో, స్కాట్సుఎమల్షన్ తినేటందుకు రుచిగా, జీర్ణమయేటందుకు సులభంగాచేశారు. సాధారణ కాడ్ లివర్ ఆయిల్ కంటె ఇది మూడురెట్లు గుణంతో పనిచేస్తుంది.

### సంపూర్ణమైన చికిత్స

పిల్లల అభివృద్ధికి బాగా తోడ్పడేగుణాలే స్కాట్సుఎమల్షన్ పెద్దవారికికూడా బలం గలిగించటానికి సాయంజేస్తాయి. సంపూర్ణమైన గుణమివ్వడానికి కాడ్ లివరాయిల్ వలె ఇది భాస్వరాన్ని, కాల్సియమ్ మొదలైనవాటిని వేరుగాకోరదు. ఇదిఒకటే సంపూర్ణమైనగుణం ఇస్తుంది. బలహీనంగావున్నప్పుడు లేక, జబ్బునుండి తేరుకుంటువున్నదు



టానిక్కుగా ఉపయోగపడుతుంది. దగ్గు, జలుబు, ఇన్ఫ్లుయెంజా మొదలైన అంటువ్యాధులు రానీకుండా ఆపడానికి, పెక్కుమంది డాక్టర్లు, ఉపయోగించిన వారుకూడా స్కాట్సుఎమల్షన్ సిఫార్సుచేశారు.

తలిదండ్రులకు తెలియాలి
స్కాట్సుఎమల్షను
ఎముకలను బలపరచేదాల్లో వెన్న
పాలకంటె 80 రెట్లు మేలు.
గ్రుడ్లకంటె రెండింతలు మేలు.
శరీరాభివృద్ధికి
వెన్నకంటె 8 రెట్లు మంచిది.
బనానాలకంటె 100 రెట్లుమంచిది.

# SCOTT'S Emulsion

స్కాట్సు ఎమల్షను మందీవ ర్తకులు :

శుద్ధమైన కాడ్ లివరాయిల్ నుండి ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసు (ఇండియా) లిమిటెడ్,
కలకత్తా, బొంబాయి, మదరాసు, లాహోరు, రంగూను, కొలంబో, కాన్పూరు, పాట్నా,

# అనాధ బాలిక

పిసపాల వేంకటేశ్వరరావుగారు

(స్వర్ణయుగ పరిషత్)

తల్లిలేదూ
తండ్రిలేదూ,
దరికిదీసేదాతలేదూ;
కూడులేదూ,
కునుకులేదూ,
ఉండటానికి ఉనికిలేదూ;
కులములేదూ,
గుళ్ళులేవూ,
బ్రతుకుతెరువుకు పరువులేదూ;
నీళ్లులేవూ,
పాలులేవూ,
కట్టటానికి బట్టలేదూ;
...ఏమియున్నది?...
పచ్చినెత్తురు వ్రచ్చిత్రాగే
ఆకలున్నది!
గంపెడంతా—ఆకలున్నది!!

* * *

చిక్కిపోయీ వక్కనరమై
బొమికబొమ్మై భయంవేస్తూ
ఎదురుగాలికి ఎగిరిపోయే
రెపటలాగా ఊగిపోతూ—
ధూళిమయమై, దుబ్బుదుబ్బై,
బొంతరేగినబుఱ్ఱ గోకుతు—
మానమంతా మట్టిగలపే
చింకిపోతను సర్దుకుంటూ—
కీళ్ళలోపల కండలేకా
నడుమునడుమూ నిలచిపోతూ—
నిప్పుచెరిగే ఎండవేడికి
స్రొక్కి-స్రొక్కీ సొలసిపోతూ—
వెంటబడ్డా వీధికుక్కల
తోలలేకా దుఃఖపడుతూ—
'పిచ్చి'దంటూ రాళ్లురువ్వే
కొంటెపిల్లలకోర్చుకొంటూ—
తూలిపోతూ, వాలిపోతూ,
సోలిపోతూ, కూలిపోతూ,
గడపగడపకు నడచిపోయీ
"అమ్మగారు అన్న"మంచూ
గొంతువిచ్చీ కూయలేనీ
ఆయనాధకు-అదృష్టహీనకు
గుండెమీదా సుత్తిదెబ్బ
'దబుల్'! న మ్రోగిపోయిన
తలుపుశబ్దమె సమాధానం!
లోకమంతా నిశ్శబ్దం!!

* * *

ధనమదాంధుల దరికిదీసే,
క్రూరకర్ముల కూడదీసే,
కపటులను కాపాడజూచే,
దుష్టతతులకు దోచిపెట్టే,
ఈ
పాడులోకం
పా
పిష్టిలోకం
ఆదరించకపో తెపోనీ
జాలికన్నులనైన చూడదు!
దిక్కు-ఎవ రీదీన జగతిని
ఆ దయామయుదృష్టితప్ప
ఆ అనాధకు-అ
దృష్టహీనకు!

# పొరపాటు

చ. రా.

హఠాత్తుగా వెళ్లి నామిత్రులకు నా రాక చేత ఆశ్చర్యము కలిగించడము నాకు మహా సరదా. ఆవేళ శనివారము. పొద్దుపోకపోతే హాస్టలునుండి శారద యింటికి మూడు గంటలకే వెళ్లాను. శబ్దము చేయకుండా హాల్లో ప్రవేశించాను. ఒక మూలలలో ఆంధ్రపత్రిక ముఖాని కడ్డంగా పట్టుకొని శారద కూర్చునివుంది.

తిన్నగా వెళ్లి శారద వెనుకనుంచున్నా. నా రాకచేత శారదకు ఎంత ఆశ్చర్యము కలిగించాలని అనుకొన్నానో శారద ముఖము చూసేటప్పటికి నా కంతకంటె ఎక్కువ ఆశ్చర్యము కలిగింది. శారద పత్రిక చూస్తూ కన్నీరు కారుస్తూవుంది. ఎంతసేపటినుండి ఆలా దుఃఖిస్తుందో ఏమో గాని కళ్లుమాత్రము ఎఱ్ఱబారివున్నాయి.

నాచేతులు మెల్లగా శారద భుజాలపైన వుంచాను. వులికిపడి శారద కళ్లు పైకెత్తి నావైపు చూచింది.

'అక్కయ్యా! వచ్చావూ? ఇలా కూర్చో. ఇదో ఇది చూడు.'

కన్నీళ్లు తుడుచుకుంటూ ఆదుర్దాతో పత్రిక నాచేతి కిచ్చింది.

శారదస్థితి నా కేమీ అర్థమైంది కాదు. 'ఏమిటది?' అని తిన్నగా అడిగాను.

'నీవే చూడమ్మా!' అంది కష్టము దీనత్వమూ పైకి కనిపించేటట్టు.

నేను ముంగురులు సవరిస్తూ 'ఏమిటో చెపుదూ' అని బుజ్జగించాను.

'అబ్బా! చూద్దూ తరువాత చెపుతాను' అని పత్రికలో ఒక చోట చూడమంది.

నా కదేమిటో చూడాలనివుంది కాని శారద ముఖములోని దీనభావము ఆవిడ ఆందోళనా నాదృష్టినంతా ఆకర్షించాయి. పత్రిక చూచాను. ఒకచోట

"నూరు రూపాయల స్థిరమైన ఉద్యోగము. పాతికేళ్ల పట్టభద్రుడు. ఈ బ్రాహ్మణయువకునికి రూపవతి విద్యావతి సంగీతపరిజ్ఞానము గల పదహారేళ్లకు లోబడిన వధువు కావాలి. బాలవితంతువైనా సరే. వివరాలకు—"

అని వుంది.

నే నది చదువుతూవుంటే నా ముఖమే చూస్తూవుంది శారద.

'దీనిలో ఏముంది దుఃఖించడానికి?'

'ఇదెవరు ప్రకటించారో తెలుసా?'

'ఎవరో స. నా. గారట?'

'అంటే_?'

'నాకుమాత్రం తెలుసా ఎవరో?'

'ఔను మరి ఏలా తెలుస్తుంది?'

'బాగావుంది. ప్రపంచములోనివారంతా నాకు తెలిసివుండాలా?'

'మరి ఎఱిగినవారినే తెలియదంటే ఏమనాలి?'

'పోనీ యీ రాద్ధాంతమెందుకు? నీవే చెప్పకూడదూ!'

'చెప్పడాని కేముంది ప్రత్యక్షంగా తెలుస్తూవుంటే. క్రిందవుండే పూర్తైనా వారెవరో తెలుపడములేదా?'

'పూరుమాత్రము మావూరే. అయితే ఎంతమందో మావూళ్లో స. నా. గారలు.'

'ఔనౌను. నూటడెబ్భైపదుకొండు మంది.'

నేను లోలోపలనే నవ్వుకున్నాను. అవి పొడిఅక్షరాలైనా శారద హృదయములోని వ్యక్తికి సంబంధించి వుండవలసిందనే ఆవిడ అభిప్రాయము.

'అంతకోప మెందుకూ? వారు సత్యనారాయణరావుగారనేనా?' అన్నాను.

'కాక మరెవరు?'

మబ్బుల్లో మరుగైయున్న చంద్రబింబం ఓమారు బైటికివచ్చింది. శారద ముఖాన ఒక చిరునవ్వు వెలిగింది. కళ్లు భూమిని చూశాయి.

'పోనీ ఆయనే అనుకుందాం. ఇలా వారు ప్రకటించుకుంటే నీ కేం?'

'పో! అక్కయ్యా! నీ వెపుడూ ఇంతే.'

చంద్రమండలాన్ని మరల మబ్బులు ఆక్రమించాయి.

'ఇహ ఈ పిచ్చివేషాలు చాలించు' అని దగ్గరకు లాక్కున్నాను.

'నిజంగా నా అదృష్టము బాగుంటే ఇదంతా ఏమిటి?'

'ఈ ప్రకటనవారు చేసిందో కాదో. పరిచయముతప్ప,నీసంగతి ఆయనకు చెప్పిన వారెవరూలేరు, ఆయనమాటా యివ్వ లేదు. ఆయన ఇప్పటి వుద్దేశ్యము ఏమో? ఏమీ తెలీక లేనిపోనివన్నీ వూహించుకొని యీలాదుఃఖించడము నాకేమీ నచ్చడము లేదు.'

'.................'

'పోనీ, నే నీమారు సెలవుల్లో మావూరు వెళ్లినపుడు ఆయన్ని ప్రత్యక్షముగా అడిగి కనుక్కొంటాను. అంతవఱకు ఓపిక పట్టాలి మరి.'

'అదికా దక్కయ్యా! వారిప్రకారము మంచివా రెవరైనా దొరికితే—'

అబ్బ! ఇంత అవసరమూ ఆతురత ఎందుకో!

'దొరికితే పెళ్లిచేసుకుంటారు నీకేం?' అన్నా కొంచము విసుగుతో.

'నిజమే మరి' అంటూ గబగబా మేడ మీదికి వెళ్లిపోయింది. వెలికివచ్చినది యీ చిన్నముక్కే అయినా దీల్లో ఒక ప్రేమ పూరితహృదయము తన అభిప్రాయాన్నంతా పైకి ఉబికించింది. ప్రేమఫలిత మీలాగేవుంటుందనీ, తానొకరికి సంపూర్ణంగా అర్పించిన జీవితము దుఃఖమయమై పోయిందనీ, పవిత్రప్రేమతో తప్పా మరే విధముగా ఆకర్షించే గుణాతిశయాలు తన దగ్గర లేనందువలన తనప్రేమ ఫలించి జీవితములో తనకు ఆనందము అనేది లభించుట అసాధ్యమనీ ఆ ముక్కలోనే

ధ్వనించాయి. నాకుచేతగాదుగాని ప్రణయ శాస్త్రపారంగతు లెవరైనా ఆ ముక్కను ఆ ధోరణిలో వినివుంటే దానికి ఎన్ని అర్థాలు, ఎంత వ్యాఖ్యానము చేసి వుందురో ?

నేనూ వెంటనే పైకివెళ్లాను. శారద మేడమీద గదిలో మంచముపైన పడు కొని వెక్కి వెక్కి ఏడుస్తూవుంది. దగ్గరకు వెళ్లి ఎంతో వూరడించాను. ఎంతో ధైర్యము చెప్పాను. కాని ఆవిడ దుఃఖ ప్రవాహ మాగిందికాదు. నాకుకూడా కళ్లల్లోనుండి ప్రవాహాలు బైలుదేరాయి. ప్రేమచే నిండిన హృదయానికి కన్నీటి కాలవలు సన్నిహితబంధువులు.

మేడమీది కెవరో వస్తున్నట్లు చప్పు డైంది. శారద లేచికూర్చుంది. ఇరువురు కళ్లు తుడుచుకున్నాము. ఇంతలో పని మనిషి వచ్చి ఏదో తీసుకొని క్రిందికి వెళ్లింది.

'శారదా! ఎందుకమ్మా ఆలా దుఃఖ స్తావు. చెప్పానుగదూ నేను ఆయనతో మాటాడుతానని.'

'ఏదో దుఃఖ మాలాగ వచ్చింది. మరేమీలేదు.'

'నాకు తెలుసు నీ హృదయమేమిటో. అంతకైతే మీ నాన్నగారితో ఈవిష యము చెప్పి రావు సంగతేమిటో కను క్కోమన్నా?'

'ఊహూ...'

'అయితే నేనే మాటాడుతానులే.'

'ఏలాగ?'

'ఏదో ఏకవిధముగా. నీవిషయమంతా చెపుతాను. ఆయన ముందు అభిప్రాయాల తోనేవున్నారో, నీవిషయము ఎందుకు విచారింపకూడదో అడుగుతాను.'

'...............'

'ముందు కృష్ణవేణి విషయములో లాగే ఈ ప్రకటనలోకూడా యితరుల బలవంత ముందేమో తెలిసికోవాలి.'

'వా రింకా కృష్ణవేణి విషయమై ప్రయ త్నిస్తున్నారని నాతో పద్మ మొన్న అంది.'

'నిజమే. వారి భగీరథప్రయత్నాలకు ఆయన 'ససేమిరా' గారై వున్నట్టుంది.'

'ఏమో వారివారి అదృష్టం.'

'కానీ నీవుమాత్రము ఈలా దుఃఖంచ వద్దు. శరీరం చెడుతుంది. నీ కింకా చదువే నాలుగేళ్లుండే. మధ్యలో ఈపిచ్చ నీ కెక్కడ దాపురించిందమ్మా!'

'ఔను. తనకు అనుభవములేకపోతే సరి. ఇతరులది పిచ్చ క్రిందికే వస్తుంది.'

శారదను సంతోషపెట్టి ఆవిషయాన్ని మరిపించి వెళ్లడానికి నా కా సాయంకా లము ఎనిమిది గంటలైంది.

* * *

నేనూ శారదా ఏలగ్నములో కలసి కొన్నామోగాని మాయిద్దరికీ ఏకోదరుల

కంటె ఎక్కువ చెలిమి ఏర్పడ్డది. శారద మా స్కూల్లో చేరినపుడు ఏడేళ్ల అమ్మాయి. నేనూ ఆవిడ అక్కచెల్లెండ్ర లాగ ఆడుకునేవాళ్లము. ఆచిన్ననాటి చెలిమే రానురాను చాల గాఢమౌతూ వచ్చింది.

శారద కిపుడు పద్దెనిమిదేళ్లు. నాకంటె ఐదేళ్లు చిన్నది. ఆవిడసౌందర్యాన్ని గుణాతిశయాలని నే నిపు డేమీ చెప్పను. మిత్రు లొకరినిగురించి ఒకరు ఏమిఅన్నా అది అతిశయోక్తి ఔతుంది. అయినా ఆమె ఉద్యానవనములో అధిక ఆదరముతో పెంపబడిన ఒక సుందరలత అనిఅనవచ్చును.

ఇపుడు శారద ఇంటర్ సీనియర్ చదువుతూంది. మాతృమూర్తి ఆమెకు చిన్నపుడే దూరమైనందున తండ్రి ఎంతో గారాబముగా పెంచేవారు. పి. ఆర్. కాలేజీకి దగ్గరగానే వారి యిల్లు.

మా తండ్రిగారికి శారద తండ్రి రమణ రావుగారికి అమితమైన స్నేహం. రమణ రావుగారు మావూరికి మానాన్నకోసర మెన్నోమార్లు వస్తూవుంటారు. ఒకమారాలా వచ్చినపుడు మా నాన్నగారు సత్య నారాయణరావుగారితో మాట్లాడుతున్నారు. ఆయన మా నాన్నగారి ఆఫీసులోనే ఉద్యోగి. మా నాన్నకు ఆయనంటే ఎంతో అభిమానము; అతను తరచుగా మా యింటికి వస్తూవుండడమువల్ల మేము చనువుగావుండేవాళ్లం.

రమణరావుగారికి మా నాన్నగారు సత్య నారాయణరావును ఎఱుక చేశారు. ఎప్పటిలాగే రావు గుణగణాలనీ ఉన్నతాశయాలనీ ఎంతో శ్లాఘించారు. తరువాత వారందరు గలసి లోకాభిరామాయణము చాలవఱకు మాట్లాడారు. ఆ మరుదినము రమణరావుగారు వూరికి వెళ్లారు.

ఒక సాయంత్రము సత్యనారాయణరావు వస్తే పెళ్లిప్రసంగాలలోనికి దింపారు మా నాన్నగారతన్ని. రమణరావుగారు తన కూతురిని సత్యనారాయణరావుకు ఇవ్వాలని సూచించారనీ ఆసంబంధము అన్నివిధాలా ఉత్కృష్టమైనదనీ మా నాన్నగారు ఆయనతో చెపుతుంటే నా కమితమైన ఆశ్చర్యమేసింది. పైగా శారద ఎటువంటిదో మా నాన్నగారు నన్ను చెప్పమన్నారు. నే నావిడను బట్టుమూర్తిలా పొగడాను. అన్నీవిని సత్యనారాయణ రావు 'ప్రసాదరావుగారూ, మీరు చెప్పిన సంగతులు వినడానికి ఎంతో సంతోషము కలుగుతూవుంది. నా మేలుగోరి మీరిటువంటివి తలపెట్టడము నా అదృష్టమే. కాని వివాహవిషయాల్లో ప్రకృతం నా మన స్సెంతమాత్రమూ చొరడములేదు. క్షమించండి' అని తన అభిప్రాయము వెల్లడించారు. మాతండ్రికి, వారివల్ల ఆవార్తను విన్న రమణరావుగారికి చాలా ఆశాభంగం కలిగింది. అపుడు శారద ఫిఫ్తుఫారము చదువుతూ వుంది.

కొంచముకూడ ఈవిషయము శారదకు తెలియదు. తరువాత రెండుమార్లు సత్య నారాయణరావు కాకినాడ వస్తూంటే



వివాహానంతరము విండ్సరు దంపతులు



జర్మనుదేశమున బ్లాకు ఫారెస్టునందలి యొక

మానాన్నగారు నన్నుచూచి రమ్మన్నారట. ఆ రెండుమార్లు వారు నన్ను చూడవచ్చినపుడు శారద కూడ నాతో మాట్లాడుతూ హాస్టలులోనే వుంది. ముగ్గురుకలసి లోకాభిరామాయణము మాట్లాడాము. అపుడే కనుక్కొన్నా ఆయనంటే శారదకొకవిధమగు గౌరవము కలిగిందని. అందులో విచిత్రముకూడా కనిపించలేదు. ఎందుకంటే సత్యనారాయణరావుతో ఎంత స్వల్పకాలము మాట్లాడినవారెవరైనా వారి సుహృద్భావాన్ని కనిపెట్టి ఆకర్షింపబడుతారు; గౌరవించుతారు.

ఇది జరిగినతరువాత ఒకమారు నేను శారదకు మావూళ్లో జరిగిన పెళ్లిప్రసంగము పెద్దల ఆశయాలు చెప్పాను. శారదకు ఆ విషయము చాల సంతోషాన్ని కలిగించినట్టు తోచింది. ఎందుకంటే ఆనాటి శారద ప్రశ్నపరంపరలకు నాకు సరియైన ఉత్తరాలివ్వడమే కష్టంగా కనపడింది. సత్యనారాయణరావు ఆనాడు చెప్పిన అభిప్రాయాన్ని నేను స్పష్టంగా తెలియజేసినా శారద దానిని గమనించినట్టు కనపడదు.

ఇది ఇలావుండగా ఇంకొవిశేషము జరిగింది. మా సీనియర్ బి.ఎ. తరగతిలో కృష్ణవేణి అనే అమ్మాయి వుండేది. ఆమెను తండ్రి బలవంతాన సత్యనారాయణరావు వచ్చి చూచి వెళ్లారు. అది నాకు శారదకు కూడా తెలుసు.

దీని తరువాత శారదకు హఠాత్తుగా ఒక జబ్బువచ్చింది. చదువు సాము మానేసి తిండి తీర్థాలు దూరముచేసి ఎక్కడ కూర్చుంటే అక్కడే, ఎక్కడ పడుకుంటే అక్కడే బిక్క ముఖమువేసుకొని యేదో దీర్ఘముగా ఆలోచిస్తూ వుండేది. తలచుకొన్నపుడంతా తలనొప్పి జ్వరము తయారు. పరీక్షరోజులు కాబట్టి కాలేజికి రాకపోయినా ఇబ్బంది కలగలేదు. రమణరావుగారు డాక్టరువద్ద చూపించారు కానీ వారి కారోగము ఏమిటో తెలియక చదువువలన గలిగిన బలహీనమంటూ 'డయాగ్నైజ్' చేసి యేదో ఔషధమిచ్చారట. సత్యనారాయణరావు కృష్ణవేణి విషయములో మారుమొగము పెట్టారని మాకు తెలిసేటంతవరకు శారద జబ్బు తీవ్రత తగ్గిందికాదు. దాని సంగతి అపుడే నా కవగాహమైంది. తరువాత కూడా ఆజబ్బు అపుడపుడూ వస్తూవుండేది.

మా యిరువురి పరీక్షలూ ముగిశాయి. రమణరావుగారి అనుమతితో శారదను మా పూరు పిలుచుకొని వెళ్లాను. మావూళ్లో శారద పదిహేను రోజులుంది. ఆ రోజుల్లో కూడా ఎప్పటిలాగే సత్యనారాయణరావు మాయింటికి వస్తూవుండేవారు. వారితో నాకున్న చనువు కొద్దీ ఎన్నోవిషయాలు మాట్లాడేదాన్ని, ఒక్కొక్కపుడు శారద కూడా సంభాషణలో పాల్గొనేది. వారిరువురి హృదయాల్లో ఏముందోకాని వారేమీ యెఱుగని కొత్తవాళ్లలాగే మెలగేవారు.

ఇది సుమారు రెండేండ్లక్రిందట విషయము.

సత్యనారాయణరావునుగూర్చివిని ఆయన గుణాతిశయాలచేత ఆకర్షింపబడి అప్రయత్నముగా శారద తన హృదయాన్ని ఆయనకు అర్పించిందో, లేక తన తండ్రిగారే వారితో పెళ్ళిపెత్తనం చేశారుకదా, వారు దాని కంగీకరింపకపోయినా అభ్యంతరము చెప్ప లేదుకదా అనేమైనా వారిని ప్రేమించిందో చెప్పడానికి వీల్లేదు. ఇంతకూ ప్రేమించే వాళ్లకు కారణమంటూ ఒకటుంటుందా?

*　　*　　*

ఒక హృదయాన్ని విప్పి అందలి విషయాలని విస్పష్టంగా చదవడానికి మిత్రత్వమునకు వున్నంతశక్తి మరియే'అత్వమునకు'వుండదు. తండ్రికి కాని తదితరులకుగాని విప్పని తన హృదయాన్ని శారద నాకు స్పష్టపరచింది. ఈ పరిస్థితులలో తన జీవితసమస్య ఏమౌతుందో ఏమో అని దుఃఖించేది. అసలే శారదంటే నా ఆరవప్రాణము.ఆస్థితిలోఆమె ఆలాదుఃఖస్తుంటే నేనెలాగైనా ఆమె మనోరథము సిద్ధింపచేయాలని దృఢము చేసుకున్నా.

శెలవులువచ్చాయి. ఎంతోకష్టమయింది శారదను విడిచిపోవడానికి. సత్యనారాయణ రావుకు నేనంటే ఎంతో అభిమానము దయా కూడ. అంచేత ఆయని ఎలాగైనా ఒప్పించడానికి ప్రయత్నిస్తానని పాపము శారదకాశ పెట్టి బైలుదేరాను మావూరికి. కాని శారద సందేహామే నిజమైతే సత్యనారాయణరావు వేరువిధముగా ప్రత్యుత్తరమిస్తే తరువాత గతేమిటి అనిపించింది. ఈతలంపు నా కతిభయంకరముగా తోచుటచేత మరీ దాన్ని నా మనసులోనికి రానివ్వలేదు.

యథాప్రకారముగా సత్యనారాయణ రావు మాయింటికి వస్తున్నా నాకాసంగతి ప్రస్తావించడానికి ధైర్యము, తగిన అవకాశము కలిగిందికాదు. ఒక ఆదివారము మా నాన్నగారు లేనపుడు ఆయనవచ్చారు.

'అమ్మాయీ! నాన్నగారున్నారా?' ఆయన నన్నాలాగే పిలిచేవాడుక.

'లేరన్నయ్యా! ఎక్కడకో వెళ్ళారు.'

'ఇపుడువస్తారా తిరిగి?'

'తెలియదు.'

'మరలవస్తాను. వారువస్తే—'

'ఎందుకు కొంచంసేపుండండి. నేను మీరువస్తే బాగుండు ననుకొంటూవున్నా.'

'ఏమిటమ్మా విశేషాలు?'

'ఏమీలేదు కాని ఒకవిషయము మిమ్ముల అడగ దలచుకున్నా.'

'అలాగా! అయితే చెప్పుమరి.'

'మీరు కోపగించుకొనకపోతే—'

'ఇదేమిటి? ఈవేళ కొత్తవిషయము?'

'మేడమీదకు వెళుదాంరండి చెపుతాను.'

'అంత రహస్యమా?' అన్నారు పైకి లేస్తూ.

'రహస్యంకాదుగాని అక్కడ ప్రశాంతంగా మాటాడుకోవచ్చు.'

మేడమీదికివెళ్లి డాబామీద కూర్చున్నాము.

'ఏమిటో కానీమ్మా'అని ఆయనే ప్రారంభించారు.

కొంచము సందేహించాను. అది గ్రహించి 'సంకోచమెందుకు నేనేమి కొత్తవాన్నా?'అన్నారు.

'రమణరావుగారు మీకు జ్ఞాపకమున్నారా?'

'ఏ?—'

'కాకినాడ. మానాన్నగారివద్దకు పలుమారు వస్తుంటారు. సుమారు మూడేళ్ల క్రింద—'

'ఓహో! వారా! ఔను జ్ఞాపకముంది.'

'శారద ఆయనకుమార్తె. ఆఅమ్మాయి నా ఆరవప్రాణం—'

'మీస్నేహితము నాకు తెలియకపోవడమేమిటి?ఆవిడను నేను బాగా ఎఱుగుదును. మంచి అమ్మాయి. కాని నీవు సమయము చిక్కినపుడల్లా ఆ అమ్మాయి స్తుతిలోనికి దిగకుండా వుండలేవు.'

'ఆమె అటువంటిది కాబట్టి. ఆమె హృదయము నాకు బాగా తెలుసు. ఆమెకొక గొప్ప చిక్కువచ్చిందిపుడు.'

'పాపం! ఏమిటది, పరీక్షలో సరిగా వ్రాయలేదా?

'చక్కనే వ్రాసింది, పాసుకూడా అవుతుంది. కాని అంతకంటె గొప్ప పరీక్ష ఆవిడ నెదుర్కుంది. దానిలో నెగ్గడానికి మీ సహాయం తప్పనిసరి. కాని మీరేమంటారో?'

'ఏమంటాను? నాశక్తి సామర్థ్యాలన్నీ ఉపయోగించైనా సాధ్యమైనంత సాయము చేస్తాను. నాసంగతి నీకు తెలియదేమిటమ్మా! ఏమిచేయాలో చెప్పు.'

'శారదహృదయాన్ని ఓ మహానుభావుడు దొంగలించాడు. అదెలా జరిగిందో ఆవిడకు తెలియదట. ఆయనకంతకంటె తెలియదు. రమణరావుకు మాత్రము ఆయనకు శారదనిచ్చి పెళ్లిచేయాలనివుంది.'

'విచిత్రంగావుందే. అయితే ఇపుడిక కావాలసిందేమిటి?'

'రమణరావుగారు పెళ్లివిషయమాయనతో ప్రస్తావించి మూడేళ్లయింది. అపుడు పెళ్లి అక్కరలేదన్నారట. తరువాత ఎవరూ వారి నడగలేదు. ఈ సంగతి తెలియకపోయినా శారద ఆయనను ప్రేమించింది. వారిపుడు అంగీకరిస్తారో లేదోఅని భయపడుతూవుంది.'

'ఈ సంగతి ఆయనకుచెప్పి ఆయనను ఒప్పించడము మంచిది.'

'అందుకే మీ సహాయము. ఆయన ఇపుడు కన్యకోసరము వెదకుతున్నాడు కూడా. ఆయనతో మాట్లాడి మీరు దీన్ని ఎట్లాగైనా అంగీకరించేటట్టు చూడాలి.'

'తప్పకుండా. అటువంటి అమ్మాయి కోరితే ఆయన నిరాకరింపడనుకుంటాను.

ఆయనెవరో చెప్పితే వెంటనే ప్రయత్నిస్తాను.'

'మీరు చెప్పినంత సులభముగా చేయలేకపోతారేమో అనే నాభయము. అందుకే మిమ్మింతగా ప్రార్థించడము. ఆయన ఇపుడు నిరాకరిస్తే శారదజీవితము దుఃఖభాజనమౌతుంది. ఎల్లాగైనా మీ రాయన్నీ ఒప్పించితీరాలి.'

'ఒప్పిస్తాను. నా సాహసమంతా ధారపోస్తాను. ఇంతకు ఆయన్ను శారద అంతగా ప్రేమించిందా ?'

'అనే నాఅభిప్రాయం. లేకపోతే ఇదంతా ఎందుకు ?'

'ఆయన ఇష్టముతప్ప ఇతర ఆటంకాలు ఏమీలేవుకదా.'

'లేవనే అనుకుంటాను. వుండినా వివాహం జరగకపోతే శారద ఎంతగా_' నాకళ్లల్లో నీళ్లుతిరిగాయి.

'ఎందుకమ్మా వ్యసనపడడము ? కార్యసాధనానికంటె రాగాలుతీయడానికి ముందంజవేస్తారు మీరెపుడూ. ఆయనెవరో చెప్పవు. ఈవిషయము ఆయనకుచెప్పి త్వరగా తేల్చుకుంటే మరీమంచిదిగదా.'

'మంచిదే కాని శారద తండ్రితో తన సమాచారంచెప్పదు. కూతురింకా చదువుతూందిగదా అని తండ్రి ఆ సమాచారన్ని శ్రద్ధవహింపరు. శారద ఈవిషయంలో ఎంత మాత్రమూ సాహసించలేదు. కాని ఆయన తనను నిరాకరించి ఎక్కడైనా వివాహము చేసుకుంటారేమో అని ఎపుడూ భయపడుతూవుంటుంది.'

'తనమనసువిప్పి యితరులకు తప్పని సరిగా చెప్పవలసివచ్చినపుడు చెప్పకపోతే తరువాత జీవితమంతా దుఃఖంపవలసివస్తుంది. ప్రతివారికీ తనజీవితము సౌఖ్యకరముగా చేసికోడానికి కొంతసాహసము వుండితీరాలని నా అభిప్రాయం.'

'మంచిమాటే అన్నయ్యా! మీరీకార్యం తప్పకుండా చేస్తానంటారుకదూ ?'

'బాగుంది. ఆయనెవరో చెప్పకుండానే ?'

'చెప్పడానికేముంది. ఆ మహానుభావులు మీరే.'

'ఆఁ!' అన్నారు.

నామాట లాయన్ని బొమ్మనుచేశాయి. రెప్పలార్పకుండా నావంకకే చూస్తున్నారు.

'అన్నయ్యా ! ఎందుకంత ఆశ్చర్యం.'

'అమ్మాయీ! ఇవినిజమా పరిహాసమా.'

'నిజము. నాతోడు ! ఏమన్నయ్యా ! ఏమంటావుమరి.'

నాకు ఆతురత హెచ్చయింది.

'అనడానికేముంది. నా హృదయములో పెళ్లివిషయాలు సంచరించకముందు రమణరావుగారు దీన్ని ప్రస్తావించారు. అంతే.

తరువాత శారద అలా అయిందని నాకెంత మాత్రమూ తెలీదు. ఇంతకూ ఇపుడు ఏంచేయమన్నావు ?'

'ఏమిచేయమంటానా! మీా కర్పించివుండే ఒకపవిత్ర హృదయాన్ని సుఖపెట్టమంటాను. దీనికేమి అభ్యంతరముంది? వధువుకావాలని మొన్న ప్రకటించారుకూడా.'

'అయ్యో పిచ్చితల్లీ! అదేనా ఇంత చేసింది ? నా మిత్రుండొకడు నూరురూపా యల వుద్యోగంలోవున్నాడు. అతడూ పట్ట భద్రుడే. అతనికోసరమై ప్రకటనచేస్తూ క్రింద నా పేరువేయమన్నాడు. అంతే.'

'అయితే వధువు మీాకు కాదన్న మాట.'

'కాదని చెప్పడము లేదా!'

నా హృదయముమీాద ఓపెద్దభారము తగ్గినట్లయింది. శారద కీవిషయము తెలిస్తే ఎంతసంతోషిస్తుందో అనుకున్నా.

'మరీమంచిదన్నయ్యా! నామాటవినరూ? శారదను ఇపుడో చదువుముగిసిన తరువాతనో పెళ్లిచేసుకోరూ? అభ్యంతరమేముంది?'

'కొత్తదేమీా అవసరములేదు. వున్నదే చాలు.'

'ఏమిటది?'

నాకుభయమేసింది.

'ఇంకా తెలియదూ? నాపెళ్లిజరిగి ఏడా దికిపైన అయింది. పరస్పర మిష్టపడే చేసు కున్నాము. తలవనితలంపుగా తటాలున జరిగి నందున చాలమంది కది తెలియకనేపోయింది. నీవప్పటినుంచి యీావూరువచ్చి రెండురోజులు మాత్రముండి వెళ్లావు కాబట్టి నీకుకూడా తెలియదేమో ? మీానాన్నగారైనా చెప్పలేదా ?'

నాకు కొండవిరిగి మీాదబడ్డట్లయింది. ఆశ్చర్యముకంటె దుఃఖముపొర్లివచ్చింది. అది కలా నిజమా అంటూ నిర్ఘాంతిపోయి చూస్తున్నా. నాప్రయత్నమేమైంది ? శారద గతి ఏంకావాలి? అనే ఆవేదనే నన్ను యమ యాతనపెట్టడానికి ఆరంభించింది.

'క్షమించండి అన్నయ్యా! తెలియక అడి గాను' అన్నా దుఃఖమాపుకుంటూ.

'మీారే క్షమించాలి నన్ను. నే నీవిషయ ములో ఏమీాచెప్పదలంచుకోనలేదు. చెప్ప దగినదికూడాలేదు. కాని మీాకీచింత కలిగించి నందుకు నాకు చాలవిచారంగావుంది.' అన్నారు. ఆయన మాటలలోనే మనోవేదన తెలిసింది. ముఖమంతా వాడిపోయింది. ఇక అక్కడ నిలువలేక మరుమాటాడకుండా వెళ్లిపోయారు.

# అల్లిక పనులు

ఎన్. వి. నరసింహయ్యగారు

## పట్టు, ఉల్లుదారములతో చేయనగు అల్లికవిధములు

### ముఖ్యమైన సామానులు, వాని నుపయోగించు విధము



విలువగలవైనను మంచిసామానుల నుంచుకొని ఈ పనులను చేయువలైన కష్టములేక సులభముగ కొన్ని దినములలో వీనిని నేర్చుకొనవచ్చును. అల్లికను నేల



మీదనుంచి చేయుట సరిగాదు. దానిమీద నూలు యొక్క రంగును, నూలును చెడిపోవును. ఈపనికి కావలసిన సామాను లుండునవైన, మీరు పట్టుతెరలు, దిండుఒరలు, మేజామీది గుడ్డలు, టపేటా, పట్టు పెండలగు దారములలో చిత్రపు అల్లికపనులుచేసి గృహమును అలంకరించవచ్చును. అయితే కేస్ మెష్ డ్ గుడ్డను ఉపయోగింపరాదు.

1. అల్లికపనులకు సాధారణమైన సూది పనికి రాదు. దీనికి తగిన సూది వేరుగఉన్నది. ఈ సూదికి రంధ్రము పెడల్పుగను, పొడవుగనునుండును. అట్లుం డుటవలన పట్టుదారమునుకూడ సులభముగ కూర్చ వచ్చును. ఏదారమైనను కుట్టునప్పుడు చెడిపోదు.

2. కేన్వాస్ గుడ్డను కుట్టు సూదియొక్క రంధ్రము దాని మొనయును మొద్దుగయుండును. దానికి పొడ వైన సూది నుపయోగింపరాదు. ఏలనగా కేన్వాస్ దారము పోగువీడి తెగిపోవును.

3. ఒకజత సన్నని మొన గల్గియుండు కత్తెరలు, సాధారణమైన అంగుస్తాన మొకటియు నుండవల యును.

4. నేర్చుకొనువారు మొట్టమొదట ఉల్లుదార ముతో నార్కాలిపైవేయు గుడ్డపైనైనను లేక ఒరపై అయినను కుట్టుట నేర్చుకొనవలయును. ఉల్లుదార ముతో కుట్టునది మిక్కిలి బిగువుగానుండక సాధారణ ముగనున్నచో చూచుట కందముగాయుండును. పట్టు దారముతో కుట్టునవైనను మిక్కిలి గట్టిగనే కుట్టవల యును. అయితే, పట్టుదారముతో చేయు అల్లికపను లంతే అందముగానుండవు. అందువలన దీనికి తగు పుష్పపుపనులు చేసిన ట్రాన్స్‌పర్ డిజైన్ (Transfer design) కాగితములు కొని దానిని చూచుకొని పలు విధమైన పుష్పములను కుట్టుటకు నేర్చుకొనవచ్చును.*

---

* అల్లికపనులకు సంబంధించిన అన్నివిధములైన సామానులును శారదాఎంబ్రాయిడరీ హౌను, నెం. 8 డి. పైక్రాఫ్ట్సురోడ్డు, ట్రిప్లికేన్, మదరాసునందు దొరకును. కావలసినవారు గృహలక్ష్మి సంపాదకులద్వారా వ్రాసి సామానులు తెప్పించుకొనిన కమిషను యివ్వబడును. పైకంపెనివారు అన్నివిధములైన అల్లిక పనులను ఉచితముగా కావలసినవారికి నేర్పుచున్నారు.

5. దీని కుపయోగకరమై ప్రత్యేకపు చిత్రములు గల కాగితములు, ఎరుపు, పసుపు, ఊదా రంగులలో అచ్చువేయబడియున్నవి. వానిని మీరు కోని గుడ్డపై నుంచి దానిపై పలుచని కాగితముంచి పెన్సలుతో బలముగ పైన వ్రాసినట్లైన ఆ గుడ్డయందు ప్రతిబింబ మేర్పడును.

6. కంబళిపై ట్రాన్స్‌పర్ చేయుటకు పలచని కాగితముపై అచ్చువేయబడియుండు డిజైను కంబళిపై నుంచి రెండును ఒకటిగనే కుట్టి పని ముగించినపిదప పైకనబరచిన కాగితమును జాగ్రత్తగా చింపి ఎత్తి వేయవలయును.

(1) అల్లికపనులు చేయునప్పుడు మీ రుపయోగించునట్టి సామాను కుడిచేతియందు చాచిపట్టుకొని వ్రేళ్లపై దారము దీసికొనుచు కుట్టిన నది చెడక సులభముగ వచ్చును.

(2) ఎప్పుడును ఒంటికుట్టుతో ఆరంభించరాదు. చిన్నకుట్లు నొకటిపై నొకటివేసి ప్రారంభించవలయును.

(3) పూర్తిచేయుటకు వెనుకనుండు కుట్టునందు కుట్టు వేసుకొని రావలయును.

(4) పూలుదారమును ఎప్పుడుగాని చేతితో త్రెంపరాదు. కత్తిరించవలయును.

(5) పోగుపీడిన పూలుదార ముపయోగింపరాదు.

(6) చిన్నసూదిని ఉపయోగించరాదు.

(7) ముఖ్యమైన అల్లికపనులను కాగితములో చుట్టి భద్రముగా నుంచవలయును.

## Bullion Stitch (బుల్లియన్ కుట్టు)

ఈ కుట్టునందు వెనుకకుట్టునందుండి సూదినిదూర్చి మీరు ప్రారంభించియుండు కుట్టునందు తేవలయును. పేనిచిన దారమును సూదిపై కుడిప్రక్కనుండి కుడి ప్రక్కకు తెచ్చి కుట్టును సరిగా సరిదిద్దుకొనవలయును. ఎడమచేతియొక్క పెద్దవ్రేలువలన ఆ దారమును పట్టుకొనిలాగవలయును. సూదిని ధనస్సురీతి వంకరగా దూర్చవలయును. రంధ్రము చిన్నదిగా యుండు సూది నుపయోగించునట్లైన సులభముగ దారమును కుట్టి లాగవచ్చును.

### Bullion Stitch





హెరింగ్ అను ఎముకకుట్టు (పైరూపు)

## *Chain Stitch*



ఇది 6 విధములు

### Chain Stitch (గొలుసుకుట్టు)

ఎడమచేతి పెద్దవ్రేలిచే దారమును పట్టుకొనవలయును. ఒకకుట్టును ప్రారంభించి ఆ కుట్టుమూలముగ పైప్రక్క ఆ కుట్టునందుండి దూర్చి దిగువవైపునకు తేవలయును. లోప్రక్కనుండు కడపటకుట్టు మూలముగ సూదినిదూర్చి కుట్టుచు రావలయును.



(ఒంటిసాటిక కుట్టు)

ఇది కుట్టుయొక్క పైపైపున పొడవుగను వచ్చుచుండును. అందు ఒకటి చిన్నదిగను, మరియొకటి పెద్దదిగను సాటిక కుట్టు వంకరకుట్టు రీతిగ వచ్చును. వంకరకుట్టును మూడు విధములుగా కుట్టవచ్చును.

## *Daisy Stitch*




### Daisy Stitch (డెయ్‌సీకుట్టు)

ఎడమచేతియొక్క పెద్దవ్రేలివలన దారపుకొన పట్టుకొని గొలుసుకుట్టురీతి కుట్టవలయును. కుట్టురీతి ఎ. బి. పటములందు చూపబడియున్నది.

## *Couching*



### Couching Stitch (కౌచింగ్ కుట్టు)

వ్రాసియుండు డిజైనుయొక్క గీతపై క్రిందిప్రక్క ఒక్కొక్క కుట్టుగా వంగినట్లు సన్ననిదారముచే కుట్టవలయును.

### Knot Stitch (ముడికుట్టు)

ఇది కంబళి (Blanket) కుట్టులో చేరినది. ఇది కుట్టునపుడు మొదట గుడ్డఅంచునందు ప్రారంభించి,

## Knot Stitch




దారమును ఎడమచేతితో నొక్కిపట్టి పటములో చూపినరీతి కుట్టువేయవలయును. తరువాత ఆ కుట్టు మూలమున దానిప్రక్కనే వలయమువచ్చురీతి మరియొక కుట్టు కుట్టవలయును. దారమును గుడ్డ లోభాగమునకే లాగుచుండవలెను. వలయము పెద్దది కావలసినచో రెండుకుట్లను కడపటికుట్టునకు ఎడమప్రక్కగా వలయమును చేర్చి కుట్టవలయును. A,B,C, పటములను చూడుడు.

## Satin Stitch



Satin Stitch (సాటిన్ కుట్టు)

ఈకుట్టును యెడమప్రక్కనుంచియైనను, కుడిప్రక్కనుండియైనను ప్రారంభింపవచ్చును. అయితే, యెందటి కుట్టుమాత్రము బిగువుగనుండిన ఈకుట్టు సాధ్యమగును. ఒంటిసాటిన్ కుట్టునకు మధ్య చోటువిడిచి కుట్టియుండును.



Button Stitch (బొత్తాముకుట్టు)

కుడిచేతియొక్క పెద్దవ్రేలిచే అడుగునదారమును పట్టుకొని సూదిని లాగవలయును. కుట్టుతో కుట్టు ఒకటిగాచేరునట్లు కుట్టవలయును.

## Zig-Zag Chain Stitch



Zig-Zag Chain Stitch (జిగ్-జాగ్ గొలుసు కుట్టు)

ఒకప్రక్కకు ఒక గొలుసుకుట్టును వంకరగనే దానిని మరొకప్రక్కను వేయవలయును. కావలసిన

రీతి వంకరటింకరగా వేయుచువచ్చినచో నది జిగ్-జాగ్ కుట్టుఅని చెప్పబడును.

***Stitching***



Stitching (కుట్టు)

వెనుకనున్న కుట్టును ఎత్తుకొని దానినుండి కుట్టుట వలన నిది యేర్పడుచున్నది.

***Stem Stitch***



Stem Stitch (స్టెమ్ కుట్టు)

ఈకుట్టుకు సూదికి కుడిప్రక్కగనే దారముతో చిన్నకుట్టు వేయుచురావలయును.

---

# స్వామిద్రోహము

బుర్రా వేంకటనాంచారయ్యగారు ఎం;ఏ.

(ప్లాసీయుద్ధరంగమున ననుభవహీనుఁడగు సురాజదౌలాను కవ్మోరంగిన మీరుజాఫరు దౌష్ట్యమిట సూచితమైనది.)

ఎక్కడదాపురించెనోకో యీ మిడిమేళపుబంటు నిన్ను పై
నిక్కులఁ బెట్టి శాత్రవులచేతికి కాయయు కత్తి యిచ్చియు
న్నక్కట గుంటగుంటకును నొదలయొగ్గఁజేసి యుక్తితా
నక్కగఁబన్నె శౌర్యమదిసర్వము గంగనుగల్పె సాహెబూ!

పెంచియుఁబెద్దఁజేసి యతిప్రీతిని నీయది సైన్య మన్న మే
లెంచక తిన్నయిల్లె నిధియెంచక గ్రుద్దిలు దుండగీడు చే
యించినకీడు నామదినినెంచిన గుండెయు నీరుగారు ని
న్గాంచిన నెవ్వడే న్వగచు కంటికి మంటికి నేకధారగాన్!

# స్వామిద్రోహము

బొత్తుగఁదృప్తిలేక రణభూమిని గర్జనఁజేసిరాజుకున్
నెత్తినమేకుఁగొట్టి యవినీతుఁడవై చరియించినావు ని
న్నెత్తుకపోను మిత్తి సరి యెట్టులఁ జేరితి శత్రుపక్షమీ
శక్తికిలేదు దీటయినశక్తి మఱొక్కటి పొమ్ము కాఫరా !

తాతలనాటి పౌరుషముదక్కెనొ యుక్కది మొక్కవోయెనో
చేతులుగట్టి రాజ్యరమ చేతులకీయఁగ శత్రుకోటికిన్
భీతిదొలంగి కాపురముపెట్టిరి నీ పురికోటలోపలన్
జాతిపటుత్వసంపదలు చంచలతన్ గనెనేమొ సాహెబూ !

జాతికొలంది గౌరవము జన్మకొలందియు వర్తనంబున
వ్రాత యదేమి శాత్రవుల బారికి దోసిలియొగ్గినావు ఛీ
రాతిపొలంబులోఁ గనమె రత్నములెన్నియొ పాదుషాలకున్
లేతరికంబుదెచ్చితివి లేవొకొ నీకు కులాభిమానముల్.

ఖ్యాతిదొలంగిపోవు నధికారము జెల్లును నాటితోడ నో
యీ ! తలగుడ్డగౌరవ మదెట్టులఁగాతువొ నీదెభారమా
భీతిమొకింతలేని యరిభీషణు నన్నిటు గొంతుగోయుటల్
నీతియె యంచు బల్కెనవనీపతి కన్మొరగంగ బాడియే.

గుండెలుబాదుకొంచు రణకోవిదులేపడి యుగ్గినారలే
యెండకునట్టి ఛత్రమిదు కెట్టులో సర్వమెఱింగితౌర యా
దండిమగండ్లనైన నతిదారుణరీతి వధింపశక్తుఁడౌ
గండడు, పాదుషాయసువుగ్గైకొనఁ బెబ్బులిమూకపంచితే.

తిండికిలేనివాని నొకదిట్టరిజేసిన నీదుపాపమే
పండియు నాటి కివ్విధము పక్వముజెందెనుగాదె భూప యా
ఖండల శస్త్రతుల్యమగు కత్తికరంబున గ్రాలుచుండి భూ
మండలమంతయున్ మనుజమౌళి ! ధరించెడి నీక కష్టముల్.



## సౌందర్యము రెండు చర్మముల నంటియున్నది.

చర్మముక్రింద తైలగ్రంధు లెండిపోయి క్రింది చర్మమును కృశింపజేసినపుడు గీతలు, ముడుతలు ప్రారంభించును పైచర్మము నశించి కఱకుదనము బైలుదేరును. ఈ రెండు చర్మములకును వేరువేరు చికిత్స లవసరము.

### గీతలను ముడుతలను రాకుండజేయుట

రాత్రులందు 'పాండ్స్ కోల్డుక్రీము' పూయుము. ఇది క్రిందిచర్మమునకు దిగి తైలగ్రంధులను నింపి, అచటి కండరముల బలపరచును. ఇది రోమకూపముల శుద్ధిచేయుటవలన నల్లనిమచ్చలు మాయును.

### గరకుచర్మమును బాగుచేయుట

మీ పైచర్మమునకు 'పాండ్స్ వానిషింగ్ క్రీము' గావలయును. దీనిని ముఖమునకు మెడకు చేతులకు పూసికొని, రాత్రియంతయు నుండనిచ్చిన, ఉదయమున చర్మము మృదువుగా నూతనముగా మనోహరముగానుండును.

ఉచితము : దీనిని నేడే పంపి పాండ్స్ రెండు క్రీముల ట్యూబులను పాండ్స్ ఫేసుపౌడరు మాదిరులను ఉచితముగా బడయుడు. (చెక్ షేడు) నేచురల్ ......రోజ్ క్రీమ్...........బ్రునెట్ ......

డాడ్జి అండ్ సెయ్‌మర్ లిమిటెడ్,
3, విలెట్ రోడ్డు, బొంబాయి.

పేరు.......................................

చిరునామా......................No. GL. 16.




కోకోనలు మీ తలవెంట్రుకలను నున్నగ నల్లగ, మృదువుగ, ప్రకాశముగ ఉండేటట్లుచేస్తుంది. ఏ స్త్రీ యైనా, తలవెంట్రుకలు చక్కగా లేకపోతే, అందముగ కనుపించదు. తనజుట్టు నిడుపుగ మెత్తగ, నున్నగ, నల్లగ ఉండాలంటే కోకోనలు ఎల్లప్పుడు ఉపయోగించాలి.

కోకోనలు నెత్తిని శుభ్రముగనుంచి చుండు పట్టకుండచేస్తుంది. చిన్నతనమున తలనెరియుట, దువ్వుకొనునపుడు వెంట్రుకలు రాలిపోవుట, మున్నగువాటిని ఆపుతుంది.




కోకోనలు శుభ్రమైన కొబ్బరినూనెనుండి తయారుచేయబడినది. దానిలో నెత్తికిని మెదడుకును, తలవెంట్రుకలకును మంచిపనిచేయు మూలికలసారము కలిసివుంది. కోకోనలు వాడి తలవెంట్రుకలను చక్కగను దువ్వుకొనుట కనుకూలముగను చేసుకొనండి.

## కోకోనలు

కలకత్తా కెమికలుకంపెని లిమిటెడ్ వారిచే తయారుచేయబడినది.

# బెంగాలీ మిఠాయి

### సాతీక్ మోహనభాగ్

| | | |
|---|---|---|
| సాతి | 4 | ఔన్సులు |
| నేయి | 2 | ,, |
| పంచదార | 4 | ,, |
| పాలు | 2 | ,, |

సన్ననిమంటలో నేతిని కాచవలయును. సాతిని ముద్దగ లేకుండ నుడుకబెట్టవలెను. తదుపరి పాలనుబోసి యుడికించి చక్కెరను చేర్చి, ముద్దగ నగుచున్న సమయమున దించుకొనవలయును.

సులభముగా జీర్ణమగును గాన నేతిలో త్వరగా గలియును. ఈహల్వా జీర్ణశక్తి మందముగ నుండువారికి బలకరముగ నుండును.

### పప్పా మోహనభాగ్
### (బొప్పాయి హల్వా)

| | | |
|---|---|---|
| బొప్పాయికాయలు | 2 | |
| పాలకోవా | 4 | ఔన్సులు |
| నేయి | 2 | ,, |
| పాలు | 4 | ,, |
| పంచదార | 12 | ,, |

ఒకపౌను గుజురువచ్చునట్టి రెండు పచ్చి బొప్పాయికాయిలను తీసికొనివచ్చి పై పొట్టును చెక్కవలయును. తరువాత దానిని ఐదారు పొడుపైన ముక్కలుగా కోసి లోపలివిత్తనములు మొదలగువానిని పూర్తిగా దీసివేయవలయును. తరువాత శుభ్రముగ కడిగి మెత్తబడువఱకును నీటిలో నుడికించి నీటిని పారబోసి మెత్తని గుజురుగా దంచుకొనవలెను.

ఈగుజురును నేతిలో పదునైదునిమిషములకాల ముడికించినగాని బొప్పాయి వాసనపోదు. ఆతరువాత పాలును పంచదారను వేయవచ్చును. అది చిక్కబడు సమయముచూచి కోవాను గలుపవచ్చును. వీని నన్నింటిని బాగుగాకలిపి ముద్దగుచున్నపుడు దించుకొని ద్రాక్ష, బాదము మొదలగునవన్నియు గలుపనగును.

ఎచటగావలసినను దొరకు ఈబొప్పాయి కొంచము పండుట కారంభించినతరువాతనే హల్వా కుపయోగింతురు. కాని పైవిధముగ పచ్చికాయలతో తయారుచేసిన హల్వా కూడ ఎంతో రుచిగానుండును. ఈపండ్లనుండి చెట్టునుండి వచ్చునట్టి తెల్లనిపాలలో 'పాపెయిన్' అనబడు జీర్ణకరమగు పుల్లని పదార్థము గలదు. కాలేయము సంబంధించిన జబ్బులకుకూడ నిది యుపయోగపడును.




## పిల్లలకనడములో పెద్దచేతులు - ఒకకాన్పునకు 8 మంది బిడ్డలు

వియన్నాలో మెకానిక్కుగాపనిచేయుచున్న నొక చీనాదేశీయునిభార్య యిటీవలనే ప్రసవమైనది. అపుడు ఒకరితర్వాత నొకరుగా ఏడుగురుమగపిల్లలును, ఒక ఆడపిల్లయును పుట్టిరి. అందరును ఆరోగ్యముగాను, పుష్టిగనుఉన్నారు. ఈరీతిగా ఒక్కకాన్పునకు 8 మంది బిడ్డలుకనుట ఎచ్చటను జరిగియుండలేదు. స్కాట్లండు దేశమున ఒక స్త్రీకి 14 కాన్పులకు మొత్తము 11 జతల కవలపిల్లలుపుట్టిరి. మరియొక స్త్రీకి ఆరుకాన్పులలో పురిటికిముగ్గురువంతునను, 13 కాన్పులలో పురిటికియిద్దరివంతునను మొత్తము 19 కాన్పులకు 44మందిబిడ్డలుపుట్టిరి.

## బాలికశవమునకు పెండ్లి

సౌందర్యవతియైన యిరువదేండ్లబాలిక చనిపోయినప్పటికిని గుర్తుకొరకు ఆమె ఎవరిని ప్రేమించెనో ఆతనికిచ్చి పెండ్లిచేసిరి. ఆమె ఒకనిని ప్రేమించెను. పెండ్లినిశ్చయమయ్యెను. పెండ్లిదినమునకు ముందురోజున ప్రమాదవశమున ఆమె మరణించెను. కాని మరణానంతరమైనను ఆమె పతినికిచ్చి పెండ్లిచేయవలెనని కడసారి కోరిక. అందువలన ఆమె బ్రతికియున్నట్లుగనేభావించి పెండ్లిజరుపుటకు మతగురువు ఒప్పుకొనగా ఉంగరములు వధూవరులకు మార్చిరి. ఇది జరిగిన రెండుగంటలకే ఆమెను పూడ్చివైచిరి.

## దివ్యదృష్టిగల బాలుడు

కాలిఫోర్నియాలో గ్లిండేల్ అనుచోట పాటుమార్క్వ్యాన్ అను పదమూడేండ్లబాలునకు దివ్యదృష్టిగల కండ్లుగలవు. ఆతని కండ్లకు దట్టముగ వస్త్రములుజుట్టినను ఏవస్తువునైనను చూడగలడు. అట్లుకండ్లకు గంతలు ఉండగనే కారు నడపును. బిల్లియర్డ్సు ఆటలలో పాల్గొనును. లేసులుఅల్లును. లేసులు అల్లుటలో అంత నిపుణుడు లేడందురు. ఆతడు ఈదుట, గోలీలాడుటయందెక్కువ ఇష్టపడును. బాలుడు చాలరూపవంతుడు. మూడుసంవత్సరములనుండి ఈబాలుని దివ్యదృష్టికి కారణము శాస్త్రవేత్తలు తెలిసికొనజాలకుండిరి. కండ్లకు గుడ్డలు కట్టినను తడుముకొనకుండా మామూలు వానికంటెవడిగా పుస్తకముచూచి చదువును.

ఇటీవలనే డాక్టరు రైనాల్డ్సుగారు ఆబాలుడునుదుటినుండి చూడగలడనియు, కిరణములు ఆతనినుదుటి నుండి మెదడునకుపోవుచున్నవనియు అభిప్రాయపడెను. ఆతనినుదుటికి వస్త్రములుచుట్టినచో ఏమియుకనబడదు.

## పొట్టివాళ్లకు పెళ్లి అక్కరలేదా?

యూగస్లోవియా సర్కసుకంపెనీలో ఇద్దరు మరుగుజ్జులు పనిచేయుచున్నారు. వారిలోఒకడు పురుషుడు మరొకతెస్త్రీ. మగవానివయస్సు 28 సంవత్సరములు, 2 అడుగుల 11 అంగుళములుపొడవు. స్త్రీకి 23 సంవత్సరములవయస్సుగలదు. ఆమె పొడవు 2 అడుగుల 8 అంగుళములు. వారిరువురును

వివాహము చేసికొనుటకు నిశ్చయించుకొనిరి. కాని యూగోస్లేవియా చట్టముప్రకారము వధూవరులు కనీసము 3 అడుగుల 3 అంగుళములు పొడవైనను నుండినగాని వివాహమాడుటకు వీలులేదు. ఎట్లైనను వివాహమాడ నిశ్చయించుకొని, వారు ఆర్థడాక్సు, కాథలిక్కు, ముస్లిము, జూయిషు చర్చిలన్నియును తిరిగి దరఖాస్తు పెట్టుకొనిరి. గాని పాపము వారు కేవలము పొట్టివారను మిషచేతనే అన్నిచోట్లను నిరాకరింపబడిరి.

## ఉద్యోగములేక ఉద్వాహము - 7,500 మంది విద్యావతులకు భర్తలు

“ఈ విద్యావతుల నిరుద్యోగసమస్య పరిష్కారము కావలెనంటే వివాహం చేసుకోవాలి” అని విద్యాశాఖ మంత్రి చెప్పినమాట ఆధారముగా చేసుకొని నిరుద్యోగవిద్యావతులంతా చేరి మంత్రికి ఒక పిటీషను పెట్టుకున్నారు. ఆ పిటీషనులో “మాకు ఉద్యోగాలు దొరకవు కనుక మగవాళ్లకు ఉద్యోగాలివ్వండి. వాళ్లను మేము పెండ్లిచేసుకుంటాము. మేమందరము ఉపాధ్యాయినులమేకనుక ప్రస్తుతం ఉద్యోగాలులేని ఉపాధ్యాయులకే ఉద్యోగాలియ్యవలసింది” అని వ్రాసుకున్నారు.

మంత్రిగారు ఈపిటీషనుచూసి నిర్ఘాంతపోయారు. ఒకరా, యిద్దరా భర్తలను ప్రోగుచెయ్యడానికి. 7500 మగవాళ్లను అందులోను ఉపాధ్యాయులను వెదకి వాళ్లకు ఉద్యోగాలిస్తే ఈసమస్య పరిష్కారమగుతుంది. ఇంతకు ముందెప్పుడూ, ఏదేశములోనూ ఈవిధంగా భర్తలను వెదకిపెట్టమని గవర్నమెంటుకు దరఖాస్తుపెట్టుకోలేదు.

ఎట్లాగైనా పార్లమెంటులో మంత్రిచెప్పిన ఈమాటనుపట్టుకొని ప్రేలాడుచు 7500 మంది స్త్రీలు 5 గురి నాయకత్వముక్రింద “నిరుద్యోగఉపాధ్యాయినుల సంఘ” మని ఒకదాని చేర్పరుచుకొన్నారు. వారిలో చాలామంది రూపవతులు యుక్తవయస్సులోనివారును ఉన్నారు. ఉద్యోగాలులేని మగవాళ్లనే పెళ్లిచేసుకుంటే “జోగీజోగీరాసుకుంటే బూడిదరాలిం”దన్న సామ్యంగాఉంటుందని వాళ్లకి మొదట ఉద్యోగాలిస్తేనేగాని వివాహాలు చేసుకోమన్నారు. వాళ్లంతా ఉపాధ్యాయినులే కనుక మాస్టరీఉద్యోగాలు దొరికిన పురుషులనే పెళ్లిచేసుకుంటే పరస్పరము సహాయపడవచ్చునుగాన మరొక డిపార్టుమెంటులో చేరినవాళ్లను పెళ్లాడకూడదని నిశ్చయించుకొన్నారు.

ఇంతకీ వాళ్ల నిరుద్యోగసమస్య ఎట్లాఉన్నా పార్లమెంటులో నోరుజారినందుకు వాళ్లకు భర్తలను చూడడము మంత్రిగారికి ఒక పెద్దసమస్య అయిపోయింది పాపము!

## ట్రాంబండ్లలో నృత్యవినోదాలు

పోలెండుకు చెందిన లబ్లిన్‌లో ట్రాంబండ్లలో ఏవిధమైన సౌకర్యములు లేకపోవుటవలన అచటి ప్రజలు వాటిలో ప్రయాణము చేయుటకు నిరాకరించి నడచిపోవుట మొదలిడిరి. అందువలన ట్రాంకంపెనీకి అపారమగు నష్టముకలిగి దివాలాతీయు స్థితికవచ్చెను. ఈ దుస్థితినుండి తప్పించుకొనుటకు కంపెనీ యజమానులు ఒకయెత్తెత్తిరి. వారు ఆదేమాదిరిస్థితిలోనున్న సినీమామేనేజరువద్దకువెళ్లి ప్రతిట్రాంలోను తిరిగి ప్రయాణీకులను పాటలతోను, హాస్యములతోను, డ్యాన్సులతోను సంతోషపెట్టుటకు నటీనటులను సరఫరాచేయమని కోరిరి. అందులకు అతడుకూడ అంగీకరించెను. ఆప్రకారము ప్రతిదినము ట్రాములలోనృత్యవినోదాలు జరుగుచుండెను. అంతకుముందు “మాకు సౌకర్యములులేవు. మేము ఎక్కము” అని భీష్మించుకొని కూర్చున్న ప్రజలు అట్టి అపూర్వసౌకర్యములకు సంతసించి తండోపతండములుగా ఆనందించుచు ట్రాంలలో ప్రయాణము సాగించుచున్నారు. ట్రాంకంపెనీవారును సినిమావారును అమితమైన లాభమును పొందుచున్నారు. ఇంకను అదనపు సౌకర్యములను కలిగించుటకు శ్రద్ధవహించుచున్నారు. దీనిని ఆదర్శముగ తీసికొని పోలెండు, నందంతటను ఈపద్ధతిని ప్రవేశపెట్టుటకు ఆలోచనలు జరుగుచున్నవి.

# పుష్పచయము

సీమవంకాయ గుణములు

సీమవంకాయప్రచారము మన దేశములో నానాటికీ హెచ్చవుతున్నది. పట్నాలలో దీని గిరాకీ అధికము.

సీమవంకాయలు పండించడము చాలసులభం. లాభదాయకం కూడను. ప్రతివారూ దొడ్లలో పండించవచ్చును. పరిశ్రమ ఎంతో అక్కరలేదు. కొంచెం ఇసుక కలిపిన మట్టిలో ఇవి సులువుగా ఫలిస్తవి. మొదట ఒక చిన్న మడిగా చేసి విత్తులు నాటుపోయాలి. మొక్కలు నాటేవరకూ విత్తులమీద వరిగడ్డి పరిచి పైన నీరు చిలకరించడం మంచిది. అలాగు కాకపోయినట్లయితే విత్తులు నీటిపైన తేలిపోతవి. మొక్కలు మొలచిన పిమ్మట గడ్డితీసి వేయవచ్చు. మొక్కలు ఆరు అంగుళాలఎత్తు పెరిగిన తరువాత వాటిని తీసి శేరగత్తం చేసిన ఇసుక నేలలో రెండు లేక రెండున్నర అడుగులదూరంలో నాటాలి. నీరు హెచ్చు కాకుండా పదును చూచుకుంటూ పోయడం మంచిది. సాధారణంగా వారమున కొకసారి నీరుకట్టవలసి ఉంటుంది. మొక్క పెద్దదై కొమ్మలు ప్రాకుతుంది. అప్పుడు కొమ్మలు క్రింద ప్రాకకుండ పలవలుగా చిన్నచిన్న కర్రలు ప్రాతి ఆ పలవల మీదికి కొమ్మలు చేర్చాలి. అది ఒక చిన్న పందిరివలె కనిపిస్తుంది. అలాకాకపోతే కాయలు నేలకుతగిలి చెడిపోతవి.

పశువుల ఎరువు, గుర్రపు ఎరువు బూడిద మొదలయినవి చేర్చిన నేలలో ఇవి అమితంగా కాస్తవి. తక్కువగా మొక్కలు వేసేటప్పుడు పశువులమూత్రము పది రెట్లు నీళ్లతో కలిపి అప్పుడప్పుడు పోయడం మంచిది. కార్తీకమాసము ఆరంభంనుండి చైత్రమాసమువరకూ సీమవంకాయలు కాస్తవి. పుష్యమాసములో మరీ హెచ్చుగా కాస్తవి.

శాస్త్రజ్ఞులు పరిశోధించి సీమవంకాయలో ఈ క్రిందివిధముగ వస్తుగుణము ఉన్నవని కనుక్కొన్నారు.

| | |
|---|---|
| Protein | 80 జున్ను, లేక ఆవిషయజాతీయపదార్థం. |
| Carbo hydrate | 36 శర్కర, లేక శ్వేతసారం |
| Fat | 49 కొవ్వు |
| Salt | 4 ఉప్పు |
| Water | 94. 73 నీరు |

ఇవిగాక సీమవంకాయలో యురాటెక్క సిట్రిక్క (Uratic citric), ఫోస్ఫరిక్క ఎసిడిమస్ (Phosphoric) ఉన్నవి. ఇవి దీనిలోని ఆమ్లాంశము. సీమవంకాయలో విటమినులు (Vitamins) హెచ్చుగా ఉండడముచేత కాయకూర లన్నిటిలో ఇది శ్రేష్ఠమైనదని చెప్పవచ్చు. ఇందులో విటమిను ఏ. బి, సి లు విశేషముగానున్నవి.

ఈ విటమినుల గుణము తెలిసికొన్నపుడు సీమవంకాయలోని అద్భుతగుణము మనకు వ్యక్తమవుతుంది. విటమిను ఏ.—ఇది ఖటికము (Calcium) కొవ్వు జీర్ణము చేయడములో తోడ్పడి శల్యధాతువును వృద్ధి చేస్తుంది. రోగులకు మంచి శరీరశక్తి కలిగిస్తుంది. ఇది తిండిలో లోపిస్తే కండ్లకు జబ్బువచ్చి చివరకు గ్రుడ్డితనముకూడా రావచ్చు.

విటమిను బి.—ఇది నరములకూ, కండరాలకూ, మెదడుకూ బలము కలిగిస్తుంది. హృదయమూ, జీర్ణకోశమూ, కార్జమూ మొదలైన వాటిని ఆరోగ్యముగా ఉంచుతుంది. ఆకలి, జీర్ణశక్తి కలిగిస్తుంది. ఆహారములో ఇది లోపిస్తే స్కర్వీ అనే వ్యాధి కలుగుతుంది; ఆకలి మందగిస్తుంది; రక్తము క్షీణించి శరీరము చిక్కిపోతుంది. గుండెదడ, కీళ్లనొప్పులూ, కాళ్లగుత్తులు పొంగడమూ మొదలైన బాధలు సంభవిస్తవి. సి. విటమినువల్ల ఇవి నివారిస్తవి.

ఏ, బి, సీ. విటమినులు అత్యధికముగా ఉండడముచేత సీమవంకాయ అనేకరోగములకు వజ్రాయుధము వంటిది. ముఖ్యముగా (Zeopshlmia) అనే చక్షురోగమునూ "బెరిబెరి" అనే తిమ్మిరవాతమునూ, స్కర్వీ రోగమునూ ఇది నివారించగలుగుతుంది. ఆహారములో పై మూడు విటమినులు లోపించుటవల్లనే ఈ రోగములు ఉత్పత్తి అవుతవి. కాబట్టి ఈరోగముల పోగొట్టుటకు సీమవంకాయ ఉత్తమమైనది. ఇంతేకాక సీమవంకాయలో (Phosphate, Potash, Magnesium, Sodium, Sulphur, Iron)ల అంశములున్నవి. ఇవి శరీరమునకు పుష్టినిస్తవి.

ఉదాహరణముగా ఒక విషయము చూడండి.

స్కర్వీరోగము నివారించడానికి ఉడకపెట్టని సీమవంగ పండ్లరసము రోజుకు $1\frac{1}{2}$ అవున్సులు కావాలి. అరసము అయిదునిముషాలు ఉడుకపెట్టినట్లయితే రోజుకు $3\frac{1}{2}$ అవున్సు కావలసి ఉంటుంది. ఒకగంట ఉడుక పెట్టినట్లయితే రోజుకు 7 అవున్సులు కావాలి. దీనినిబట్టి పచనంచేసిన దానికంటె పచ్చిది చాలశ్రేష్ఠమైనదన్నమాట నిర్వివాదాంశము.

ఇన్ని సుగుణములు కలిగిఉన్న సీమవంకాయను మన శ్రోత్రియులు కొందరు ఉల్లి మొదలైన వాటివలె నిషేధించడము మాత్రము అవివేక మనక తప్పదు.

(ఆం. వా. ప.)

*　　*　　*　　*

## బెంగాలు స్త్రీలు, విద్యావిధానము

"The woman's cause is man's: they rise or sink
Together, dwarfed or godlike, bond or free,
If she be small, slight-natured, miserable,
How shall men grow?"

హిందూదేశమున అందులో ముఖ్యముగా బెంగాలులో ఇటీవలనే స్త్రీలు అన్నివిషయములందును కన్నుతెఱచి ముందంజ వేయుచున్నారు. నేటి పాశ్చాత్యనారీమణులను జూచి నేర్చుకొనుచు పురుషులతో సమానహక్కులకొఱకు పోరాడుచున్నారు. పరదాఆచారమును పోగొట్టుట కనేక ప్రయత్నములు చేయుచున్నారు. కలకత్తా మున్నగు పెద్దపట్టణములలో హిందూ స్త్రీలు పురుషులతో సమానముగా పబ్లికుమీటింగులందు పాల్గొనుచు మహిళాభ్యుదయమునకై తమతమ యభిప్రాయములను వెలిబుచ్చుచున్నారు. వెనుకటికంటె విద్యావతులు, కవయిత్రులు బెంగాలులో నధికమగుచు బాలికాపాఠశాలల సంఖ్య హెచ్చుచేయు

చున్నారు. స్త్రీవిద్య సరియగు పద్ధతులపై గఱపవలెను. రానే యనునాతడు చెప్పినట్లు "The education of women should always be relative to that of men. To please, to be useful to us, to make us love and esteem them, to educate us when young and to take care of us when grown up, to advise, to console us, to render our lives easy and agreeable; these are the duties of women at all times and what they should be taught in their infancy." స్త్రీవిద్య ఈవిధముగా నుండవలెను. దేశ మభివృద్ధిలోనికి రావలెనన్న స్త్రీలే కారకులు. వారి బిడ్డలను పెంచి పెద్దజేసి విద్యాబుద్ధులు గఱపు బాధ్యత మహిళామణులదే! అట్టియెడ స్త్రీలు తగినవిద్య నేర్చినగాని వారి బిడ్డలను వృద్ధిలోనికి తీసికొని వచ్చుట కష్టము. పాశ్చాత్యదేశములందువలె మనదేశమున బాలికాపాఠశాలలందు ఆరోగ్యపద్ధతులను ముఖ్యముగ నేర్పుచు వ్యాయామక్రీడలందు పాల్గొనునట్లు జేయవలెను. కట్టుపని, వంట, ఆరోగ్యవిధులు, నర్సింగు, శిశుసంరక్షణ మున్నగునవి చక్కగా నేర్పవలెను. అట్టి పద్ధతులపై బాలికాపాఠశాల లభివృద్ధిలోనికి దెచ్చుచు, బాలికలను తగినంతస్వేచ్ఛ యిచ్చినయెడల మనదేశమును యితర దేశములవలె సకల సౌభాగ్యములతో తులతూగుచుండునని మిస్ ఈషాబిస్వాస్ గారు నుడివిరి.

* * * *

భూగోళమంతటను లెక్కవేసినట్లైతే

జననమరణములసంఖ్య ఈవిధముగానుండును. మరణములసంఖ్య నిముషమునకు 67, దినమునకు 97,790, సంవత్సరమునకు 35,639,835. జననములసంఖ్య నిముషమునకు 70, దినమునకు 100,800, సంవత్సరమునకు 36, 792,000 అని అంచనా వేయబడినది.

హిందూదేశమున ప్రతిసంవత్సరము 20,000 మంది విషజంతువులచే మృతినొందుచున్నారు. అందులోను 20 మందికి 19 గురువంతున పాముకాట్లచే కడతేరుచున్నారు.

* * * *

పసిబట్టు జంతువ

అమెరికను డాక్టరు రొమేన్సుగారు కుక్కలకు పసిగట్టగలశక్తి ఎంతవరకుగలదో తెలుసుకొనుటకు పెక్కుసంవత్సరములు పరిశోధనలు చేసెను. కుక్క ఎవరిచే పెంచబడుచున్నదో వానిని ఎంతగుంపులోనైనను ఉన్నదీ లేనిదీ అతిసులభముగా తెలుసుకొనగలదు. వానిపాదములనుండియేగాక శరీరమంతటినుండియు ఒకవిధమగు వాసన వది గుర్తుపెట్టుకొని దానివల్ల నాతడుఉన్నదిక్కునుగూడ తెలుసుకొనగలదు. మనకు అత్తరపులనుండి వాసన ఎంతగాఢముగవచ్చునో అట్లే దాని కావాసన అంతగాఢముగ నుండునని ఆతడు కనిపెట్టెను.

* * * *

హార్లిక్సు బిళ్లలు

దేశదేశాలనుంచి కారసేవను చూచుటకువచ్చిన స్త్రీలు, పురుషులు, అంబ్యులెన్సు సొసైటీవారు, నర్సులు మొదలైనవారు గంటలకొలది ఆహారముమాని నిలువబడుట లేక ఒకచోటనుండి మరియొకచోటునకు నడచుచుండవలసివచ్చెను. అప్పుడు గుళికలవలె తయారుకాబడిన హార్లిక్సు మాల్టెడుమిల్కు వారికి ఆహారముగనుండెను. హార్లిక్సు ఈరూపమునగూడ ఎంత ప్రఖ్యాతిగాంచినదో దీనివిబట్టి తెలియగలదు.

# గ్రంథపరిచయము

**తులసీదళము** మారుతీగ్రంథమండలి (ఉరవకొండ, అనంతపురముజిల్లా) వెలువడిన ప్రథమ గ్రంథము.

ఇందు మూడాశ్వాసములు గలవు; ఇది మంజరీద్విపదను వ్రాయబడినది. గ్రంథకర్త విద్యార్ణవ, సాహిత్యసరస్వతి, నూతలపాటి పేరరాజు గారు.

ఒకానొకసమయమున నారదుడు కృష్ణునిదర్శించి వెళ్లుచుండ సత్యభామ యాతనిబిలిపించి 'పుణ్యంబు గడియింప' యిష్టముగలిగి 'వ్రతముల శ్రేష్ఠమా వ్రతము' దెలుపుమని ప్రార్థింప నతడామెకు 'ఇష్టపతి సిద్ధి' యనెడువ్రతమును దత్కార్యక్రమమును దెలిపెను. ఆరీతి సత్యభామ నారదునకు కృష్ణుని దానమిచ్చెను. యామె తగినధనమిచ్చి కృష్ణుని వెనుకకు దీసికొనులోపలనే నారదుడవసరపడి బజారులోనికివెళ్లి 'బలేమంచి చౌకబేర' అను 'రికార్డు' ననుసరించి మంజరిలో కృష్ణుని గొనుడని యాదవుల గోరుకొనుచుండ సత్యభామ నారదుని తొందర కీసడించుకొని కృష్ణునెత్తు ధనమివ్వ సాధ్యముగాక నారదప్రేరితయై రుక్మిణిని ప్రార్థింప యామె తులసీదళమును బదులుగానిచ్చి కృష్ణుని వెనుకకుగైకొనెను. రుక్మిణిచే చీవాట్లుదిని నారదుడు సత్యకు గర్వభంగమైనదని వెడలెను. తులసీదళమాహాత్మ్యమును దెలుపుచు దీని నీశ్వరుడు పార్వతికి జెప్పెను. ఇందలికథ ఇది.

ఇందు కథారీతి యెట్లున్నను తులసీమాహాత్మ్యమందలి యంతరార్థమును లెస్సగ గమనింపనగును. నిష్కళంకమై పరిపూర్ణమైన భక్తికిగాని వస్తువునకు ప్రాధాన్యము లేదనువిషయము ఇందు నిరూపింపబడినది. కవిత్వము సరళముగ ధారాశుద్ధితో నొప్పుచున్నది. శైలి ద్రాక్షాపాకము, వెల 0-8-0 ప్రతులు మారుతిగ్రంథమండలికి వ్రాసిన బడయనగును.

**సీతాపహరణం** మారుతీగ్రంథమండలి వెలువరించిన రెండవగ్రంథము. వెల చందాదారులకు 8 అణాలు; ఇతరులకు 10 అణాలు.

ఇది ఐదంకములనాటకము; దీనిని డాక్టరు కోకా వెంకటసుబ్బారావుగారు రచించిరి. 'దీని మొదటి కూర్పు 1923 లో వెలువడి పెక్కుమారులు పెక్కుచోట్ల ప్రదర్శింపబడి యనేక మార్పులనుబొంది యిపుడు రెండవకూర్పుగా' వెలువడినది. 'పెక్కుచోట్ల ప్రదర్శింపబడి', 'పలువురిచే మెప్పుబొందుటకు' చేయబడిన 'అనేకమార్పు' లిందులో చేర్చబడినవో లేదో తెలియదుగాని యీనాటకము మొత్తమున పఠితలకు విసుగు జనింపజేయునేమో యను సందియమునకెడమిచ్చుచున్నది.

ఇందలికథ యెల్లరెఱిగినదే యయినను యథేచ్ఛముగ మార్చబడినది. పాత్రపోషణవిషయమున తగు శ్రద్ధవహించినటుల దోపదు. 'దుర్జాతయగు శూర్పణఖనోటనే పెక్కునీతులను' బలికించుటంత విచిత్రముగ దోపకున్నను ఆమె అనవసరప్రసంగములు మాత్రము లాకర్షణీయములు గావు. లక్ష్మణుడు సీతను మాతృసమానురాలుగా నెంచియు యామెయాడిన పరుషోక్తులకుసహింపక స్త్రీలోకమునంతయు దూషించుట చింత్యనీయము; అతనిశీలమునకది తీరనికళంకము.

సంభాషణలు అనవసరముగ పెంచబడినవి. ఇందలి పాత్ర లెపుడును ఒకటిరెండు పద్యములతోనైన మాటాడ సాధ్యమగునా యనియే గాచియుండును.

ఇందలి పద్యములుమాత్రము చక్కనివి. పూర్వకవుల పోకడలుగలవు.

ఈనాటకమున శృంగారరసము బైటికి గనబడనీయక గ్రంథకర్తగారు పుస్తకమంతయు నీతులకు నిలయము చేయప్రయత్నించితిమని వ్రాసికొన్నారు.

ఏదేని రసముబోషింప ప్రయత్నించుటకు బదులు బుద్ధిపూర్వకముగ తగ్గింప ప్రయత్నించినచో నిక చెప్పవలసినదేమియు నుండదు.

పూర్వసంప్రదాయానుసారముగ రచించిన నాటకములు నిప్పటివారు మెచ్చరనిదలంచి పూర్వకథలనే యథేచ్ఛముగ రచించిన మెత్తురనుకొనుటగూడ ఆలోచింపదగినదే.

**ప్రేమపరిణామము (ప్రథమభాగము)** మారుతీ గ్రంథమండలి వారి మూడవ ప్రచురణము. గ్రంథకర్త సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులుగారు, క్రౌను 1/16 సైజు, 210 పుటలు. వెల చందాదారులకు 8 అణాలు, ఇతరులకు 10 అణాలు.

ఇందలి కథ సాంఘికము, దత్తమండలమునకు సంబంధించినది. ఈమండలమందలి సాంఘికజీవితము కొంతవఱకిందు బొందుపరుపబడినది. కథా సంవిధాన మాకర్షణీయమనియే చెప్పవచ్చును.

ఈ 'ప్రేమపరిణామము'న 'వలపు మొలకలు' మాత్రము మొలచినవి. తరువాత పరిణామవిషయము మిగిలినభాగములందు ప్రకటింపబడునేమో?

గ్రంథకర్తగా రాంధ్రపాఠకలోకమునకు చిరపరిచితులు; చక్కని సరళశైలి వ్రాయ నలవాటుపడినవారు. ఈగ్రంథమునకూడ వారిశైలి యటులేయున్నది. ఒక్కొకచోట నీచపాత్రల సంభాషణయందు దత్తమండలములందలి వాడుకభాషను వాడియున్నారు. కాని మరి కొన్నిచోట్ల సేవకాళిచేకూడ శుద్ధగ్రాంధికమునే మాట్లాడించియున్నారు! సర్వత్ర గ్రాంధికభాషనో తత్తదుచితరీతి వాడుభాషనో నుపయోగించుట గ్రంథమునకు వన్నె తేగలదు. గ్రంథమంతయు జదివినతరువాత, కథాసంవిధానమును, సంభాషణలు, పాత్రలు, సంఘటనలు ఊహాప్రపంచమునకు సంబంధించినదిగా దోచును.

**కావ్యమాల** మారుతీ గ్రంథమండలి వారి నాల్గవ ప్రచురణము. ఇందు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమిని భారతములోని 'చంద్రహాసచరిత్రము' కవిరాజహంస శాలాంత్రపు వేంకటరావుగారి 'పూజాపుష్పము', ఎఱ్ఱాప్రగడ నృసింహపురాణాంతర్గత 'ప్రహ్లాదచరిత్రము' గలవు. ఈ మువ్వురు గ్రంథకర్తలును నాంధ్రసారస్వతలోకమున ప్రసిద్ధులు. వారికవిత్వమునుగూర్చి నూతనముగా జెప్పవలసినదేమియు లేదు.

రచనావిధానమున కుత్సాహ మొసగి రచయితల నాదరింపవలసిన గ్రంథమండలి పూర్వగ్రంథములందలి భాగములనే మరల ప్రచురించుట భాషాసేవ గాజాలదు. అముద్రితములైయుండు గ్రంథములనైన ప్రకటించియున్న బాగుండెడిది.

**గౌతమబుద్ధుడు** మారుతీ గ్రంథమండలివారి పంచమ గ్రంథము. గ్రంథకర్త రూపనగుడి నారాయణరావుగారు. పుస్తకము వెల చందాదారులకు 8 అణాలు; ఇతరులకు 10 అణాలు.

ఇది సప్తమాంకములుగల నాటకము. ఇందలి కథావస్తువు మహాత్ముడైన గౌతమబుద్ధుని జీవితచరిత్ర. కథాంశములు చాలవఱకు చరిత్రనుండియే గైకొనబడినవి.

బుద్ధుని జీవితవిశేషములన్నియు మనోహరముగ మనోజ్ఞముగ నీ నాటకమందు రచింపబడినవి. ఈ గ్రంథకర్త రచనావిధానమున పూర్వుల పద్ధతి నవలంబించియున్నారు. కథాసంవిధానము లత్యంత రమణీయములు.

ఇందలి ప్రధానరసమైన శాంతము చక్కగ పోషింపబడినది. బుద్ధుని సుగుణజాలమును, అహింసాతత్త్వమును, దానిని ప్రచారణ చేయబూనిన పద్ధతులను చదువరుల నాకర్షింపకపోవు.

అచటచట సమయానుసారముగ రచింపబడిన పద్యములు రసవంతములైయున్నవి.

ప్రపంచమునంతయు నాక్రమించియున్న యశాంతికి యహింసాతత్త్వము ఔషధమనుచు గ్రంథకర్త చేసిన సూచన గమనార్హము.

**అజీర్ణము**

శ్రీయుత తల్లాప్రగడ కామేశ్వరరావు బి.ఎ., ఎం.బి. (హోమియో)గారిచే రచింపబడినది. డెమ్మీ 1/16 సైజు. 300 పుటలు. వెల 0-12-0.

సర్వసాధారణముగా గలుగుచుండు రోగములలో అజీర్ణముకూడ నొకటి. ఒకవంక దారిద్ర్యముచే బీద సాదలందును, జిహ్వాచాపల్యముచే యాహారపదార్థముల గైకొనుటయందు మితములేని ధనవంతులు విద్యావంతు లందు మరియొకవంకను అజీర్ణరోగము లభివృద్ధియగుచున్నవి. అజీర్ణరోగ మితరరోగములకు తల్లియగుట దీననిగూర్చి ప్రారంభమునందే యెల్లరు శ్రద్ధబూనవలసిన యావశ్యకతను సూచింపుచు గ్రంథకర్తగారీ పుస్తకమున గమనింపవలసిన పెక్కు విషయములనుగూర్చి వివరముగా సూచించియున్నారు.

ఇందు జీర్ణకోశము, దాని ధర్మము, ఆహారపానీయములు, వాని మంచి చెడ్డలు, అజీర్ణమునకు కారణములు, అజీర్ణలక్షణములు, అజీర్ణమువలన గలుగు యితర రోగములు, వీనికన్నిటిని హోమియోపతి ఔషధములచే చికిత్సలు సులభశైలిలో వ్రాయబడినవి. ప్రతివారివద్దను ఉండదగిన పుస్తకము. ప్రతులు గ్రంథకర్తగారివద్ద ఉంగుటూరిలో (పశ్చిమ గోదావరిజిల్లా) దొరకును.

**బాలరోగములు–చికిత్స**

ఇదియును తల్లాప్రగడ కామేశ్వర రావుగారిచేతనే రచింపబడినది. 1/16 క్రౌనుసైజున 500 పుటలు. వెల 1-12-0. మూల్యము కొంచ మెచ్చుగా కనపడుచున్నది.

జాతియోన్నతికి శిశుశిక్షణ, శిశురక్షణ ప్రవాదములని చెప్పబనిలేదు. మనదేశమున విద్యావిహీనతచేతను, వైద్యసాహాయ్య మందరి యందుబాటులో నుండకపోవుటచేతను ప్రజాసముదాయమునకు నారోగ్యముదూరమగుచున్నది. అట్టిచో పసిపాపలస్థితి దడవనేల? పెద్దవారికి చికిత్స చేయుటకంటె శిశువైద్యము కష్టము. అట్టిదాని నారంభమునందే తగుశ్రద్ధ వహింపనిచో నది మరింత దుస్సాధ్యమగును. అందుచే నిట్టి గ్రంథములు తలిదండ్రులు–ముఖ్యముగ తల్లులు–చదువుట మంచిది.

ఇందు బాలబాలికలకు గలుగు వివిధరోగములు, వాని లక్షణములు, వానిని హోమియోపతి ఔషధములమూలమున చికిత్స చేయవలసిన పద్ధతులు, హోమియోపతి ఔషధముల గుణములు, వాని వాడుమార్గములు, ఉపయోగములు చాల వివరముగ వ్రాయబడినవి. ప్రతిమాతయు జదువతగియున్నది.

**శ్రీరమా మనోహర తార మాలిక**

ఇది శ్రీయుత తుర్లపాటి గురుస్వామయ్య (చోళింగపురము) గారిచే విరచితము. ఇందు 27 నీతిపద్యములును పొన్నమ్మ దండకమును గలవు. వెల 1 అణా. వీరిచేతనే రచింపబడిన 'విద్యాప్రభావగేయము, ముక్తపదగ్రస్త మురహరముక్తావళి' (వెల 1 అణా) మాకు చేరినది.

**అభినందన పద్యమాల**

ఇందు మళయాళస్వామిపై దేవరకొండ అమ్మన్న శాస్త్రియు, సాధుమాతామతల్లిగారిపై శ్రీమతి ఆచంట సత్యవతమ్మ, సేదుదూరి గంగాధరముగారును రచించిన పద్యములు గలవు.

**గణేశ్వరాభ్యుదయము**

శ్రీపాద వెంకటసుబ్బారావుగారిచే రచింపబడినది. ఇందు విఘ్నేశ్వరుని జననాదికచరిత్ర గలదు. దీనినిగూర్చి వ్రాయదగిన దేమియులేదు. వెల 3 అణాలు. ప్రతులకు గ్రంథకర్తకు హరిశ్చంద్రపురము, ప్రియాగ్రహారము పోస్టు, గంజాము డిస్ట్రిక్టుకు వ్రాయునగును.




## జాతీయోన్నతికి స్త్రీలస్థితియే కారణము

జవహరిలాల్ నెహ్రూగారు తన పర్యటనమున సింగపూరు మహిళామణుల సభయందుపన్యసించుచు భారతస్త్రీలవిషయమై నిటుల వచించిరి.

"మనకిపుడు గావలసినది ఆత్మవిశ్వాసము, ఆత్మసౌందర్యము, శీలముగల మహిళామణులుగాని పురుషులచేతిలో నాటబొమ్మలవలె నుండువారు గాదు.

గంగిరెద్దువలె నలంకరించుకొను స్త్రీలను జూచిన నాకసహ్యము గలుగును.

ఇంతవఱ కబలలుగానుండిన భారతీయ స్త్రీలు జాతీయజీవనమున నిపుడు వీరనారీమణులై విజృంభించియున్నారు. ఇటీవల నీదేశమున జరిగినమార్పులలో నిది ముఖ్యమైనది.

వారు 1930 వ సంవత్సమున కార్యరంగములోని కురికిరి. పురుషులు కారాగారములకు పంపబడినపుడు గృహములను వీడి వారివిధులను నెరవేర్ప తాము బాధ్యత వహించిరి. వాని నత్యద్భుతముగా నిర్వహించిరి.

ఏదేశౌన్నత్యముగాని యందలి స్త్రీల స్థితినిబట్టియే నిర్ణయింపబడును. ఆదేశమునందు పురుషులెట్టి యున్నతస్థితియందున్నను వారిస్త్రీ లధమస్థితియందుండి యజ్ఞానులై యున్న ఆదేశ ముచ్ఛ్రస్థితి రాజాలదు."

పై వాక్యములం దతిశయోక్తు లెంత మాత్రములేవని స్పష్టమగుచున్నది. స్త్రీలు వృద్ధిబొందవలయునన్న పురుషులు సాధ్యమైనంతవఱకు వారికి తోడ్పడవలసియున్నది. స్త్రీలనే స్వతంత్రించి యభివృద్ధి జెందమనుటకంటె పురుషులు తమ సహకారతనుగూడ జూపుటుత్తమము. రాజకీయ జీవితమున స్త్రీలకిట్టి సహకారత సర్వత్ర అన్నిప్రదేశములందును పూర్తిగాలేదని చెప్పవలసి వచ్చినందులకు విచారమగుచున్నది. కావలసినచో నెల్లవారికిట్టి సహకారత నిచ్చి, ప్రాతినిధ్యము గల్పించుట జాతీయమహాసభకును, జాతీయ సభాధ్యక్షునికిని విధియని విన్నవించుచున్నాము.

* * *

## విండ్సరుప్రభువు వివాహము

1936 వ సంవత్సరము డిశంబరునెల 10 వ తేది తాను ప్రేమించి వివాహమాడ

దలంచుకొన్న యామెను ప్రభుత్వమంగీకరింపకపోవుటచే 8 వ ఎడ్వర్డు సార్వభౌముడు సామ్రాజ్యమునే త్యజించిన విషయ మిది వఱకు పాఠకు లెఱిగియేయున్నారు. వారు రాజ్యము త్యజించిన తరువాత విండ్సరు ప్రభువను పేరుతో ఆస్ట్రియా దేశమున వసించుచుండిరి. వారు వివాహమాడదలంచిన వాలెస్ వార్ఫీల్డు ఫ్రాన్సునందే మిత్రులింట నుండెను ఆమె విడాకులను ఏప్రెలు మాసాంతము లోపలనే పొందియుండెను. తదనంతరము విండ్సరుప్రభువుగారివివాహము జరుగవలసియుండెను. కాని యేకారణముననో నిలుపబడెను. ఆరవజార్జిగారి పట్టాభిషేకానంతరము జూను మూడవ తేది ఫ్రాన్సునందే కొలదిమంది మిత్రుల సమక్షమున సివిలుచట్టముప్రకారము విండ్సరుప్రభువు తానువలచి సామ్రాజ్యమునే యరణముగానిచ్చి తెచ్చుకొన్న వాలెస్ వార్ఫీల్డుకు వివాహమయ్యెను. తదనంతరము మతాచారముల ననుసరించి చేయవలసిన విధులెల్ల నొక బ్రిటిషు మతకర్తచే సక్రమముగ నిర్వర్తింపబడెను.

సంప్రదాయవిరుద్ధమని ప్రభుత్వమొప్పుకొనదని సాధారణయువతి—విడాకులిచ్చినను వివాహార్హత గలిగియుండుట పాశ్చాత్య ప్రపంచమున సర్వసాధారణమే అయ్యు— రాణియగుట గౌరవనీయముగాదని-ఏవేవో ఆటంకములను గలిగించి బ్రిటిషుప్రభుత్వము ఎడ్వర్డుగారిచే రాజ్యత్యాగము చేయించెను. వారును సంతోషముతోడనే త్యాగమునుగావించి ప్రపంచదృష్టిలో నత్యున్నతస్థాన మాక్రమించుకొనిరి. ఇంత జరిగినపిదప బ్రిటిషు ప్రభుత్వము వారు విండ్సరు ప్రభువు వివాహముపట్లనైన సుముఖత జూపవలసియుండెడిది. కాని అట్లు జరుగలేదు. రాజవంశమునకు జెందిన వారు వివాహమునకు ముందు విండ్సరు ప్రభువును దర్శించియుండియు వివాహ కాలమున కెవరుగాని వెళ్ళలేదు. తుదకు ప్రభుత్వపక్షమునకూడ నెవరును వెళ్ళి పాల్గొనలేదు. పై పెచ్చుగ మతానుసారముగ జరుగవలసిన వివాహమున తనంతకుతానే వివాహవిధుల నెరవేర్ప పూనుకున్న నొక మతాచార్యుని కెంతమాత్రము హక్కులేదనుచు ఇంగ్లండునుండి మతాధికారి తాఖీదులను గూడ పంపినట్లు తెలియుచున్నది. తన శక్తిసామర్థ్యములన్నియు నుపయోగించి సామ్రాజ్య మున్నతికివచ్చుట కన్నివిధముల పాటుబడుచుండిన సార్వభౌముని యభిప్రాయముతో నేకీభవింపక వారు రాజ్యమును వదలినతరువాతకూడ నీరీతి గౌరవించిన ప్రభుత్వమునుగూర్చి ఎట్టి యభిప్రాయమును విండ్సరుప్రభువు వెల్లడింపలేదు: వారిధైర్యము పట్టుదల ప్రశంసనీయములు. వారెంతటి త్యాగమునైన గావించి తనకోర్కెను నెరవేర్చుకొనిరి. వారెల్లపు డానందమనుభవింప పరమాత్ముడు వారిపాల నుండుగాక.

* * *

## జాతిద్వేషములు

దిక్కులేక దీనావస్థయందున్న భారతమాత కొలదిసంవత్సరములుగా నొకనూతన కష్టమునకు లోను గావలసివచ్చినది. ప్రతిసంవత్సరము హిందూమహమ్మదీయులకును, శిక్కులు మహమ్మదీయులకును ద్వేష మభివృద్ధిజెంది పెక్కునగరములందు దురంతరమగు దుర్మార్గములకును, హత్యలకును కారణమగుచున్నది. చాలకాలమునుండి నిట్టి ద్వేషములకు వీనివలనగలుగు కలహములకుచోటివ్వకయుండిన చెన్నగరమునసే నీదురంతములు చెలరేగి దక్షిణహిందూదేశమునంతయు నలజడిగలిగించెను. అదృష్టవశాత్తున నవి త్వరలోనే యంతరించెను. కాని వెంటనే బొంబాయియందును ఉత్తరహిందూస్థానమందలి ముఖ్యపట్టణములగు కరాచి, లక్నో, లాహోరు, అమృతసరము మొదలగుచోటులం దీజాతిద్వేషములచే కలహము లారంభమగుచున్నవని దినదినము వార్తలు వచ్చుచునేయున్నవి. దేశాభివృద్ధి కాటంకముగలిగించు పెక్కువిషయములను పరిష్కరింప శక్తిసామర్థ్యములను సంపాదించుకొనవలసిన ఈనాడు అనవసరముగ జాతిద్వేషముల నభివృద్ధిజేసికొనుచు, ఐకమత్యమును మంటగలుపుకొనుచు నుండు హిందూ మహమ్మదీయసోదరుల ఆశయమెయ్యదో తెలియదు. తా మిరువురును ప్రకృతమున్నస్థితిని మరచుట చింత్యనీయము. ఈ యంతఃకలహముల వలన దురంతముల వలన వారికి గలుగబోవు మేలేమియులేదు సరిగదా వా రితరులదృష్టిలో నతిహేయముగ జూడబడుటకు కారణమగును.

ఈ దురంతరములు జరిగినచోటులందెల్ల రక్షకభట శాఖవారు తగినశ్రద్ధను వెంటనే గైకొని దుర్మార్గముజరుగుటకు వ్యవధి నెంతమాత్రము నీయక దుండగీండ్రను నిరోధించుచు నెక్కువపాటు బడుచున్నందులకు వారి నభినందింపవలసి యున్నది.

* * *

## మంత్రిపదములపై వ్యామోహముపోలేదు

క్రొత్తపట్టణము వేసవి పాఠశాలయందరెస్టు గాబడినవారందరు విడువబడిరికాని వారిలో పదునారుమందికిమాత్రము ఆరు మాసములు కారాగారవాసమును జరిమానాలును విధింపబడినవి. నూతనరాజ్యాంగమములులోనికి వచ్చినతరువాత, నూతన మంత్రివర్గపాలనమునందు ప్రజలనుభవించిన ప్రథమలాభ మియ్యది. దీనివలన మన్ముందెట్టిలాభములు గలుగబోవుచున్నవో చూడవలసియున్నది.

ఇదంతయు నెఱిగి కాంగ్రెసునాయకులు పదవీవ్యామోహమున వీడజాలకయున్నారు. మహాత్ముడు మరల నొకప్రకటనగావించి పదవుల నంగీకరింప నాతురత గన్పరచినాడు. దానికి ప్రక్కతాళములువేయుచు తదితర నాయకులందరు రాజీపడిరి యెప్పుడెపుడు పదవులను చేకొందుమా అని ఉబ్బూత లూగుచున్నారు. రాయివంటి వారుకూడ

వానికై ప్రాకులాడుట విచిత్రముగనున్నది. ఎవ్వరేమన్నను అధ్యక్షుడు మాత్రము దృఢముగ నేయున్నాడు. పదవుల విషయమున అఖిలభారతకాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానము మార్చుటకు వీలులేదని వారి యాశయము. వీరివలెనే తదితర నాయకులు పదవులంగీకరించుటయందలి నిరుపయోగముును గుర్తింపకుండుట శోచనీయము.

* * *

ఆంధ్ర మహిళాసభ

గత మాసము 20 వ తేదీని నంద్యాలలో జరిగిన ఆంధ్రరాష్ట్ర మహాసభ కధ్యక్షత వహించుచు శ్రీమతి కొల్లా కనకవల్లి తాయారమ్మగారు నేటి రాజ్యాంగ విషమస్థితులు, ఆర్థిక, సాంఘిక, రాజకీయవిషయములందు నేటి హిందూస్త్రీకిగల స్థానము, పురాణకాలమునకును నేటికిని స్త్రీస్వాతంత్ర్యమునగల భేదము, ప్రకృత స్త్రీవిద్యావిధానము మున్నగు విషయములగూర్చి విపులముగా విమర్శించిరి. ఇప్పటికి ఏబది సంవత్సరములనుండి భారతజాతీయ మహాసభ స్వాతంత్ర్యపోరాటమును సాగించుచున్నను ప్రభుత్వమువారు రకరకములగు సంస్కరణములను ప్రవేశపెట్టుచుండిరే గాని జాతీయాభివృద్ధి కవసరమగు అధికారములు మనకు హస్తగతముచేయక చాణక్య తంత్రముతో తయారుకాబడిన యీనూతన రాజ్యాంగప్రణాళిక మనకు బలవంతముగ నంటగట్టిరి. గవర్నరులవద్ద ముందుగ హామీలనియ్యమని కాంగ్రెసునాయకు లడుగుట వివాహమునకు ముందే భరణమడిగినటులున్నదని నకుమంత్రిపు ప్రధానమంత్రిగారనిరి. 'తనకై తాను వరించి భార్యగా బడయగోరిన కాంగ్రెసునాయకుని సంసారవిషయములలో బాధ్యత వహింపనొల్లని భర్తగా నుండదలచిన గవర్నరును ముందుగ భరణ మడుగుటలో తప్పేమున్నద'ని శ్రీమతి తాయారమ్మగారు వచించిన వాక్యము మిక్కిలి యుక్తముగ నేయున్నది. ఆమె చెప్పినట్లు సంసారము సుఖప్రదముగ శాంతియుతముగ జరుగవలెనన్నచో చేయబోయెడి బాంధవ్యము బాధ్యతాయుతముగ నుండవలెను. లేనిచో నది మూడునాళ్ల ముచ్చటయేయగును.

నేటి సంఘమునందు వ్యక్తిస్వాతంత్ర్యము గలిగి స్త్రీల కున్నతస్థానమిచ్చి తగినబలము చేకూర్చుకొన్ననేగాని కేవలము పదవీస్వీకరణమువలన మనఆశయములు నెఱవేరజాలవు.

ఈ విషయమును దేశీయ నేతలందరు గుర్తించి తదనుగుణముగ వర్తించుటకన్న ఉత్తమమార్గము వేరొండులేదు.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# ఈశ్వర సం॥ర జ్యేష్ఠ ఆషాఢములు

1937 సం॥ జూలై నెల

1 అ॥ గు రా2-7 ఉభా సా4-12 వరా2-39 మొ4-11కు భో6-34
2 న॥ శు రా12-2 రేసా3-5 వర్జ్యలేదు భో6-29
3 ద॥ శ రా9-49 అశ్వప1-43 వఉ9-57 మొ11-27కు వరా10-42 మొ12-12కు భో6-25
4 ఏ॥ ఆ రా7-22 భప12-10 వరా3-5 మొ4-35కు భో6-17
5 ద్వా॥ సో సా5-4 కృ ఉ10-32 వ రా1-25 మొ 2-54కు భో6-17
6 త్ర॥ మం ప2-26 రో ఉ8-51 వప2-5 మొ3-35కు భో6-13 తిథిద్వయం
7 చతు॥ బు ప12-3 మృ ఉ7-15 వసా3-8 మొ4-3:కు భో6-8 అమావాస్యతిథి
8 అమా॥ ● గు ఉ9-51 ఆర్ద్ర ఉ5-47 పున తె4-13 వసా5-9 మొ640కు భో6-4
9 శుపా॥ శు ఉ7-34 పుష్య తె3-35 వప12-13 మొ 1-45కు భో5-0
10 ది॥ శ ఉ6-12 తదియ తె4-10 ఆశ్లే తె3-4 వసా4-6 మొ5-46కు భో5-55
11 చ॥ ఆ తె3-59 మరా2-54 వసా2-59 మొ4-34కు భో5-50
12 పం॥ సో తె3-34 పు తె3-12 వప11-30 మొ12-37కు భో5-46
13 ష॥ మం తె4-10 ఉత్తర తె4-6 వఉ10-40 మొ12-20కు భో5-42
14 స॥ బు తె4-22 హ తె5-23 వప12-57 మొ2-38కు భో5-38
15 అ॥ గు పూర్తి చిత్త పూర్తి వసా2-- మొ3-43కు భో5-34
16 అ॥ శు ఉ5-37 చిత్త ఉ7-19 వప1-26 మొ3-11కు దక్షిణాయన పుణ్యకాలము భో5-30
17 న॥ శ ఉ6-59 స్వా ఉ9-31 వసా3-41 మొ5-17కు భో7-50
18 ద॥ ఆ ఉ8-58 విశా ప11-59 వసా4-25 మొ 6.11కు
19 ఏ॥ సో 10-58 అనూ ప2-36 వ రా8-52 మొ10-38కు తొలిఏకాదశి భో7-41
20 ద్వా॥ మం ప12-57 జ్యే సా5-10 వరా1-3 మొ 2-49కు భో7-37 త్రయోదశితిథి
21 త్ర॥ బు ప2-48 మూ రా7-36 వసా6-51 మొ8-27కు శూన్యతిథి
22 చతు॥ గు సా4-18 పూషా రా9-41 వఉ6-2 మొ7-47కు భో7-28
23 పూ॥ ○ శు సా5-22 ఉషా రా11-18 వఉ6-13 మొ7-55కు భో7-22
24 బపా॥ శ సా5-42 శ్ర రా11-31 వ తె4-40 మొ భో7-19
25 ది॥ ఆ సా6-2 ధ రా1-7 శ వఉ6-16కు భో7-14
26 త॥ సో సా5-37 శ రా1-18 వఉ8- 2 మొ9-59కు భో7-10
27 చ॥ మం సా4-42 పూభా రా12-58 వఉ7-26 మొ9-11కు భో7-5
28 పం॥ బు సా3-23 ఉభా రా12-16 వఉ10-17 మొ11-30కు భో7-1
29 ష॥ గు ప1-41 రే రా11-11 వ ప11-44 మొ1-10కు భో6-56 తిథిద్వయం
30 స॥ శు ప11-41 అశ్వ రా9-52 వసా6-5 మొ7-36కు భో6-52 అష్టమీతిథి
31 అ॥ శ ఉ9-27 భ రా8-20 వఉ6-51 మొ8-21కు భో6-47

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగష్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగష్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగష్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగష్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టంబరు |
| డిసంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసంబరు |
| సెప్టంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 7 | 6 | అక్టోబరు |

# మాధవి

ఇది పుష్పసారములతో నిండియుండు ఒక నాజూకైన మంచువంటి పరిమళ పదార్థము. ఈమంచును కొద్దిగ వ్రేలితో తీసికొని ముఖమునకు లేపనమును చేసికొనిన వెంటనే అది చర్మములో మాయమై ముఖమునకు కళ, కాంతినిచ్చుచు.



ముఖమున లేచు సోబె, మచ్చలు, మొటిమలు మొదలగువానిని మాన్పును. మరియు దీనిని ముఖమునకు పట్టించుకొనిన వెంటనే చల్లగనుండి మంచు రాచుకొనినట్లేయుండును.

వెల బుడ్డి 1-కి 8 అణాలు

కేసరి కుటీరం, ఎగ్మూరు, మద్రాసు.

వ: ఇట్లు మునికుమారుం డాక్షణంబ
పరమేశ్వరుండైనం బార్వతి బిట్టులికి
ఎదురుకొని తన్నోసరించుచు.

క. తనమనమున సంభ్రమమును
దనువున ఘర్మోదకములు దనరగ శంభుం
గని సతి నివ్వెఱగై ని
ల్చెను వడకుచు నీరమునిగిలేచినభంగిన్.

చ. పతిగని లజ్జనాననము పాయగ నల్లనవాంచి సమ్మదా
మృతరసపూరితార్ద్ర వినిమీలితలోలకటాక్షవీక్షణా
యతసిత ధీధితుల్ గలయ నద్రిజవిచ్చె మహేశుమీద రా
జతగిరిమీద నున్నతి నిశాకరదీప్తులు గప్పనొప్పునన్.

నన్నెచోడదేవ.